THE HEART OF MAN
IN TELUGU

# మానవ హృదయము

*

ALL NATIONS GOSPEL PUBLISHERS
P.O. Box 2191, Pretoria 0001, R.S.A.

*

*(A Gospel Literature Mission financed by donations.)*

ISBN 0 908412 25 8

THE HEART OF MAN
IN TELUGU

# మానవ హృదయము

*

ALL NATIONS GOSPEL PUBLISHERS
P.O. Box 2191, Pretoria 0001, R.S.A.

*

*(A Gospel Literature Mission financed by donations.)*

ISBN 0 908412 25 8

# మానవ హృదయము
## లేక
# ఆత్మీయ హృదయ దర్పణము

# THE HEART OF MAN
## OR
# THE SPIRITUAL HEART MIRROR

-ఉదాహరణల ద్వారా వివరించబడిన పది ఊహాచిత్రములు-

---

దృష్టాంతరములతో కూడిన ఈ పుస్తకము తొలిసారిగా క్రీ॥శ॥ 1732 వ సంవత్సరములో ఫ్రాన్సు దేశమునందు ప్రచురించ బడినది. ఇది ఆత్మీయ హృదయ దర్పణము లేక హృదయ పుస్తకము అని పిలువ బడుచూ అనేక లోతైన ఆత్మీయ సత్యములను ఎడతెగని విధముగా మానవ కోటికి అందించుచున్నది. అన్ని ఐరోపా భాషలలోను, అనేక ఆఫ్రికాఖండపు భాషలలోను ఈవిలువైన పుస్తకము సిద్ధపర్చబడి, వివిధమత విశ్వాసములుగల మానవులచేత అత్యాశతో చదువబడుచున్నది.

పరిశుద్ధ గ్రంథమందలి పాత నిబంధనలోని దైవ వాగ్దానమగు "నూతన హృదయమును మీ కిచ్చెదను, నూతన స్వభావమును మీకు కలుగజేసెదను." (యెహెజ్కేలు 36.26) అను వచనము, క్రొత్తనిబంధన యందలి హెబ్రీ 8 : 10 వచనములో నెరవేరిన విధముగా, మన హృదయములలో ఇట్టి దైవ సంబంధమైన అనుభవము కలుగును గాక !

*J.R. GSCHWEND.*

* పాపముచేయు ప్రతివాడును ఆజ్ఞను అతిక్రమించును. ఆజ్ఞాతిక్రమమే పాపము.

* పాపములను తీసివేయుటకై ఆయన ప్రత్యక్షమాయెనని మీకు తెలియును. ఆయనయందు పాపమేమియును లేదు.

* ఆయనయందు నిలిచియుండు వాడెవడును పాపము చేయడు. పాపముచేయు వాడెవడును ఆయనను చూడను లేదు. ఎరుగను లేదు.

* చిన్న పిల్లలారా! ఎవనిని మిమ్మును మోసపరచనీయకుడి. ఆయన నీతిమంతుడై యున్నట్టు నీతిని జరిగించు ప్రతివాడును నీతిమంతుడు.

* అపవాది మొదటినుండి పాపము చేయుచున్నాడు, గనుక పాపము చేయువాడు అపవాదిసంబంధి. అపవాదియొక్క క్రియలను లయపరచుటకే దేవుని కుమారుడు ప్రత్యక్షమాయెను.

* దేవుని మూలముగా పుట్టిన ప్రతివానిలో ఆయన బీజము నిలుచును, గనుక వాడు పాపము చేయడు. వాడు దేవుని మూలముగా పుట్టినవాడు, గనుక పాపము చేయజాలడు.

* దీనిని బట్టి దేవుని పిల్లలెవరో, అపవాది పిల్లలెవరో తేటపడును. నీతిని జరిగించని ప్రతివాడును; తన సహోదరుని ప్రేమింపని ప్రతివాడును, దేవుని సంబంధులుకారు.

1 యోహాను 3 : 4–10.



# మానవ హృదయము
## THE HEART OF MAN
## దేవుని ఆలయము లేక సాతాను కర్మాగారము.

(1 యోహాను 3 : 4–10)

## THE TEMPLE OF GOD OR THE WORK-SHOP OF SATAN

ఈ పుస్తకము చదువుచున్నంతసేపు ఇది నీ హృదయ ప్రతిబింబమును చూపు ఒక అద్దముగా భావించుకొనుము. నీవు క్రైస్తవుడవైనను, క్రైస్తవేతరుడవైనను, అవిశ్వాసివైనను లేక ఆత్మీయంగా వెనకకు జారిపోయినవాడవైనను దేవుడు నిన్ను చూడగల్గినట్లు, నిన్ను నీవు చూడగలుగుదువు "మనుష్యులు పై రూపమును లక్ష్యపెట్టుదురు, గాని యెహోవా హృదయమును లక్ష్యపెట్టును." (1సమూ 16:7) దేవుడు మానవ మర్యాదల కొరకు నిరీక్షించడు.

సాతాను అబద్ధికులందరికి తండ్రియైయున్నాడు ఇతడు అంధకారమునకు యువరాజును, లౌకిక దేవతయునై యుండి వెలుగుదూత వేషమును ధరించి, స్త్రీ-పురుషులను మోసపరచువాడై యున్నాడు. ఈ దినములలో కూడ అబద్ధపు అపోస్తలులు, మోసగాండ్రైనపనివారు, క్రీస్తుయొక్క అపోస్తలులవలె నటించుచుండుట గ్రహింపగలము. ఇది సాతాను పనియే. "ఇది ఆశ్చర్యముకాదు. సాతాను తానే వెలుగుదూతవేషము ధరించుకొనుచున్నాడు" (2 కొరింథి 11:13-14)

సాతాను ఈ యుగ సంబంధమైన దేవతగా ఉండి, మానవ మనో నేత్రములకు గ్రుడ్డితనము కలుగజేయుట వలన వారు దేవుని చూడలేకపోవు చున్నారు. అంతేగాక, దేవునియొక్క మహా ప్రేమను, యేసుప్రభుని రక్షణ సంకల్పముతో కూడిన మరణ మర్మమును గ్రహింపలేకున్నారు. పాపాత్ములందరూ, అవిశ్వాసులందరూ దేవుని దృష్టిలో మృతులును అంధులునై యున్నారు. అట్టివారు వాయుమండల సంబంధమైన అధిపతిని అనుసరించి నడుచుకొనువారు (ఎఫెసి 2:2) అట్టివారు తమ తప్పిదములను ఒప్పుకొనకుండా తమ ఆత్మీయ నేత్రములకు కనువిప్పు లేకుండా ఉన్నంత వరకూ, నిత్యనాశనమును కోరుకొనువారై యుందురు అట్టివారు పాపములేనివారమని చెప్పుకొని తమ్మును తామే మోసపుచ్చుకొందురు "అపవాది యొక్క క్రియలను లయపరచుటకే దేవుని కుమారుడు ప్రత్యక్షమాయెను" (1యోహాను 3:8) "కాబట్టి దేవునికి లోబడి యుండుడి. అపవాదిని ఎదురించుడి. అప్పుడు వాడు మీవద్దనుండి పారిపోవును దేవుని యొద్దకు రండి. అప్పుడాయన మీవద్దకు వచ్చును" (యాకోబు 4:7, 8)

ఈ పుస్తకమును చదువుచూ ఇందలి పటములను జాగ్రత్తగా పరిశీలించిన యెడల నీహృదయము నీవే చూడగలుగుదువు. నీహృదయ స్థితి నీకు బయలుపరచబడునట్లు దైవ వెలుగును నీలోనికి రానిమ్ము, "మనము పాపము లేనివారమని చెప్పుకొనిన యెడల మనలను మనమే మోసపుచ్చుకొందుము మరియు మనలో సత్యముండదు. మన పాపము



లను మనము ఒప్పుకొనిన యెడల ఆయన నమ్మదగినవాడును నీతిమంతుడును గనుక ఆయన మన పాపములను క్షమించి సమస్త దుర్నీతినుండి మనలను పవిత్రులనుగా చేయును. (1 యోహాను 1:8-9) అను దైవ వచనము ప్రకారము నీవు నీ పాపము లన్నింటిని కప్పుకొనక ఒప్పుకొనుము. "దేవుని కుమారుడైన యేసుక్రీస్తుయొక్క రక్తము, ప్రతిపాపమునుండి మనలను పవిత్రులనుగా చేయును."

నీవు సాతానుచేత లేక దేవునిచేత పరిపాలించబడినవాడవై యుందువు. నీవు సాతానుకు బానిసగానో, దేవునికి దాసునిగానో జీవించుచుందువు. ఒకవేళ నీజీవితము పాపము చేత పాలించబడుతుంటే, వెంటనే దాని తిరస్కరించి దేవునికి మొర్రపెట్టు. పాపుని రక్షించుటకుగాను, పాపపు శక్తిని. సాతాను యుక్తిని లయపరచుటకును, నరావతారియై ఇహలోకమునకువచ్చిన యేసుక్రీస్తు ప్రభువు ద్వారా దేవుడు నిన్ను విమోచించును. యేసుప్రభువే మన విమోచనమై యున్నాడు. పరిశుద్ధుడును సమస్త మర్మములు చక్కగా పరికించకల దేవుని సముఖములో నీవున్నావు. ఆయన నీజీవితమునందలి మరుగైన ఆలోచనలను, రహస్య కార్యములను గ్రహించ గల సమర్థుడు. ఆయన కన్నుకప్పుట నీవల్ల కానేరదు "కన్నును కలుగజేసినవాడు, చూడకుండునా? చెవిని చేసినవాడు వినకుండునా"

"తన యెడల యదార్థ హృదయము గలవారిని బల

పరచుటకై యెహోవా కనుదృష్టి లోకమందంతట సంచారము చేయుచున్నది" ( 2 దిన 16 : 9 )

"ఆయన దృష్టి నరుల మార్గములమీద నుంచబడి యున్నది. ఆయన వారి నడకలన్నియు కనిపెట్టి చూచుచున్నాడు. దుష్క్రియలు చేయువారు దాగుకొనుటకు చీకటియైనను, మరణాంధకారమైనను లేదు" (యోబు 34:21-22) "అయితే యేసు అందరిని ఎరిగినవాడు గనుక ఆయన తన్ను వారి వశము చేసికొనలేదు ఆయన మనుష్యుని అంతర్యము నెరిగినవాడు" ( యోహాను 2 : 24. ) "తన అతిక్రమములకు పరిహారము నొందినవాడు, తనపాపములకు ప్రాయశ్చిత్తము నొందినవాడు ధన్యుడు. యెహోవాచేత నిర్దోషి అని యెంచబడినవాడు, ఆత్మ లో కపటము లేనివాడు ధన్యుడు (కీర్తనలు 32 : 1, 2 ) (51 వ కీర్తన కూడా ఈ సమయమున చదువుము ) యేసు ప్రభువు ఇంకను నిన్ను ఇట్లు ఆహ్వానించుచున్నాడు. "ప్రయాసపడి భారము మోసికొనుచున్న సమస్త జనులారా ! నా యొద్దకు రండి. నేను మీకు విశ్రాంతి కలుగ జేతును." ( మత్తయి 11 : 28 - 30 )



# పటముల వివరణ

## EXPLANATION OF THE PICTURES

### ప్రథమ పటము – THE FIRST PICTURE

ఈ పటము లౌకికాశలతో నిండి, పునర్జన్మానుభవము లేని స్త్రీ లేక పురుష హృదయమును సూచించు చున్నది. శరీర దురాశలతో నిండి, దురాత్మలచే పాలించబడుచున్న పాపి హృదయము ఇదే విధముగా నుండునని బైబిలు వివరించుచున్నది. మత్తుగా త్రాగి మైకముతో ఎఱ్ఱబారిన కన్నులు గల వాని గూర్చి సామెతల గ్రంథము 23 : 29-33 వచనములలో ఈ విధముగా వ్రాయబడి యున్నది. "ఎవరికి శ్రమ ? ఎవరికి దుఃఖము ? ఎవరికి జగడములు? ఎవరికిచింత? ఎవరికి హేతువులేని గాయములు ? ఎవరికి మంద దృష్టి ? ద్రాక్షరసముతో ప్రొద్దుపుచ్చు వారికే గదా! కలిపిన ద్రాక్షరసము రుచిచూడ చేరువారికే గదా! ద్రాక్షరసము మిక్కిలి ఎఱ్ఱబడగను, గిన్నెలో తళతళలాడు చూడగను, త్రాగుటకు రుచిగా నుండగను దానివైపు చూడకుము. పిమ్మట అది సర్పమువలె కరచును కట్లపామువలె కాటు వేయును. విపరీతమైనది. నీ కన్నులకు కనబడును. నీవు వెర్రిమాటలు పలుకుదువు" (సామెతలు 28 : 29 - 33 )

ఈ క్రింది పటము పాప మానవ హృదయాన్ని సూచిస్తుంది, హృదయమే సమస్త పాపములకు స్థావరమున్నూ, పానుపై యున్నది ఇందలి వివిధ జంతువులు మానవ హృదయ మందలి వివిధ పాపములకు సాదృశ్యముగా ఉన్నవి.

దేవుడు తన ప్రవక్తయైన యిర్మీయా ద్వారా ఇట్లు పలుకుచున్నాడు. "హృదయము అన్నిటికంటె మోసకరమైనది. అది ఘోరమైన వ్యాధికలది. దానిని గ్రహింపగల వాడెవడు?" (యిర్మీయా 17 : 9)




1. పాపి యొక్క హృదయము
THE SINNER'S HEART



యేసుప్రభువు కూడా మానవ హృదయమును గూర్చి ఈలాగు చెప్పుచున్నాడు. "లోపలినుండి అనగా మనుష్యుల హృదయములోనుండి దురాలోచనలును, జారత్వములును, దొంగతనములును, నరహత్యలును, వ్యభిచారములును, లోభములును, చెడుతనములును, కృత్రిమమును, కామవికారమును, మత్సరమును, దేవదూషణయు, అహంభావమును అవివేకమును వచ్చును. ఈ చెడ్డవన్నియు, లోపలినుండియే బయలువెళ్ళి మనుష్యుని అపవిత్రపరచునని ఆయన చెప్పెను." (మార్కు 7 : 21 - 23)

**1. నెమలి THE PEACOCK:** — నెమలి యొక్క సౌందర్యమును మెచ్చుకొనని వారుండరు. ఈపటమునందుగల మయూరము, మానవ హృదయమునందుగల "గర్వము" (PRIDE) అను పాపమును సూచిస్తుంది. ఒకప్పుడు దేవుని సన్నిధిలో ప్రధానమైన ఖెరూబుగా, ప్రకాశమానముతో ఉండి యుండిన "లూసిఫర్" అను దేవదూత, ఈ గర్వ కారణంగానే పతనము చెంది, దేవునికి విరోధియగు దయ్యంగా మార్పుచెందెను. (యెషయా 14 : 9-17; యెహె28 : 12-17) గర్వమనేది నరకకూపంనుండి జనిస్తుంది. దీని పరిణామం అనేక విధాలుగా ఉంటుంది. కొందరు తమకుగల ఐశ్వర్యం విషయంలో గర్వాంధులై యుంటారు. వారు సంపాదించిన లౌకిక జ్ఞానాన్ని డిగ్రీలను చూచి అతిశయపడుతూవుంటారు. విలువైన, సొగసైన వస్త్రాలను వివిధ తరహాలలో ధరించి, విర్రవీగిపోతారు. స్త్రీలు సహా వివిధ అసభ్యకరమైన

వస్త్రాలను ధరించియు, విలువైన ఆభరణాలచేత తమశరీరాన్ని అలంకరించుకొని వారి అందచందాలను ఎదుటివారికి ప్రదర్శిస్తూ అహంకారమైన మనస్సు కలిగి యుంటారు. ఇట్టివారిని గూర్చి (యెషయ 3 : 17 - 24) వచనములలో వివరించబడియున్నది మరికొందరు వారివారి వంశములవిషయంలోను, నాగరికత విషయంలోను, వారికి గల కళా నైపుణ్యముల విషయంలోను, అహంకారులై యుంటారు. అయితే వారు "దేవుడు అహంకారులను ఎదిరించి, దీనులకు కృప అనుగ్రహించును." (1 పేతురు 5 : 5) అను సత్యమును మరచి పోతున్నారు," "అహంకారమును దేవుడు అసహ్యించుకొనును," (సామెతలు 8 : 13) "నాశనమునకు ముందు గర్వము నడచును. పడిపోవుటకుముందు అహంకారమైన మనస్సు నడచును." (సామె 16 : 18)

**2. మేకపోతు — THE HE-GOAT:** — ఇది కామతుత, అపవిత్రత, వ్యభిచారము అను మోహ సంబంధమై పాపములకు గుర్తుగా ఉన్నది. నేటి దినములలో ఈపాపము మరీ విజృంభించినట్లు కనుగొనగలము. అంత్య దినములను గూర్చి యేసుప్రభువు చెప్పుచూ, ఈ దినములను, సొదొమ గొమొఱ్ఱా దినములతో పోల్చి చెప్పియుండెను కామాతురత అను ఘోర పాపము దైవభీతిలేని స్త్రీ పురుష హృదయాలలోనే గాకుండా, మతనిష్ఠగల గృహాలలోను, సంస్థలలోను తాండవమాడుచుండుట బహు విచారకరము. అనేకు



లైన యౌవనస్థులు, సినిమాలకు, క్లబ్బులకు, చెడుపుస్తకాలకు బానిసలై, తమ లేత హృదయాలను మోహపు బాటలలోనికి మళ్ళించి, సిగ్గుమాలిన విధంగా ప్రవర్తించుట గమనించగలం. వ్యభిచారమనే పాపమునకు నేటి యౌవకవ్యాలు బానిసలైపోవుచున్నారు. దీనికికారణం వారి హృదయాలలో దైవభీతి లేకుండుటయే. "యోసేపు" అను యౌవనస్థుని చరిత్ర నేటి యౌవనస్థుల కెంతో మార్గదర్శకం కాగలదు. అతడు జారత్వంలో శోధింపబడియు దైవ నీతిని ప్రేమించినవాడై, ఆ పాపము నుండి, దూరంగాపారిపోయెను (ఆదికాండము 39) మానవ చరిత్రలో కొన్ని తెగలవారు ఈఘోర పాపమును అమితంగా అనుసరించి, నాశనంపొందిన సందర్భములు చూడగలము. నేటి నాగరికతా ప్రపంచం ఈపాపంతోనిండి దేవుని ఉగ్రతకొరకు, తీర్పుకొరకు వీక్షించుచున్నది. అట్టి తీర్పులోనికి రాకుండుటకు, దేవుడు మానవులను హెచ్చరించుచున్నాడు. "జారత్వమునకు దూరంగా పారిపోవుడి. మనుష్యుడుచేయు ప్రతి పాపము దేహమునకు వెలుపట ఉన్నది, గాని జారత్వముచేయువాడు తన సొంత రీరమునకు హానికరముగా పాపము చేయుచున్నాడు. మీ దేహము దేవుని వలన మీకు అనుగ్రహింపబడి మీలోనున్న పరిశుద్ధాత్మకు ఆలయమై యున్నదని మీరెరుగరా? మీరు మీసొత్తుకారు. విలువపెట్టి కొనబడినవారు గనుక మీదేహముతో దేవుని మహిమ పరచుడి" (1 కొరింథి 6 : 18-20) "ఎవడైనను దేవుని ఆలయమును పాడుచేసిన యెడల దేవుడు

వానిని పాడుచేయును దేవుని ఆలయము పరిశుద్ధమైయున్నది. మీరును పరిశుద్ధులైయున్నారు" (1 కొరింథి 3 : 17)

**3. పంది - THE PIG:-** ఈ జంతువు త్రాగుబోతుతనం, తిండిబోతుతనం అను పాపములను సూచించుచున్నది. ఇది బహు అసహ్యకరమైన జంతువు. ఇది మంచిపదార్థమునైనను, చెడ్డపదార్థమునైనను అత్యాశతో తినివేయును సమస్తమైన అపవిత్రతను ప్రేమించే మానవహృదయం ఈ పంది స్వభావం కలది. ఇట్టి స్వభావముగల హృదయం చెడుగును అసహ్యించుకొనక, అందు ఆనందించును చెడ్డ తలంపులు, చెడ్డక్రియలు, చెడ్డసలహాలు, చెడ్డమాటలు, చెడ్డపుస్తకాలు, చెడ్డబొమ్మలు, అంతా చెడుగే దేవునికి నిలయమైన మన దేహాన్ని అపవిత్రమై స్థలాలలోనికి నడిపించుట, అపవిత్రమైన ఆహారం, పొగత్రాగుట, నల్లమందు వేసుకొనుట మొదలైన దురభ్యాసములకు బానిసగా చేయుట ఎంతో ఘోరమైన విషయము ఇట్టి దురభ్యాసాలు పూర్వకాలంలో అంతగా కనిపించవు. కాని నేడు మరీ వృద్ధిచెందియున్నవి అయితే ఇట్టి దురభ్యాసములనుండి విడుదల దేవునిద్వారానే మనకు కలుగుచున్నది. ఈలాంటి దుర్నీతి శక్తులనుండి మానవుని విడిపించునది దైవశక్తిమాత్రమే. దేవాలయంలోనికి వెళ్ళి పొగ త్రాగుటకు ఎవ్వరునూ సాహసించరు. అట్లు చేయుట పొరపాటని వారి భావం. అయితే దేవుని నిజమైన ఆలయమగు ఈ దేహంలోనికి ఈ అపవిత్రమైన పొగను పంపివేయుచున్నామనే గ్రహింపు వారికి లేకుండుట కడు విచారకరమే "మీరు



దేవుని ఆలయమైయున్నారనియు దేవుని ఆత్మ మీలో నివసించుచున్నారనియు మీరెరుగరా? ఎవరైనను దేవుని ఆలయమును పాడుచేసిన యెడల దేవుడు వానిని పాడుచేయును" (1 కొరింథి 3 : 16-17, 6 : 18-19). తిండిపోతుగా జీవించే వ్యక్తికూడా దేవుని దృష్టిలో బహు అసహ్యుడు. మనం జీవించటానికి మాత్రమే తినవలయును కేవలం తినడానికే జీవించకూడదు. ఆకలిని ఆహారమే తృప్తిపరచగలదు. కాని అత్యాస నిత్యము తృప్తిలేనిదై యింకా ఇమ్ము, యింకా ఇమ్ము అని రోదన పెడుతుంది.

అత్యాస లేక కోరికకు తృప్తి అనేది ఉండదు. అది ఎన్నడు తృప్తిచెందదు, (పాతనిబంధన) ధర్మశాస్త్రం ప్రకారం ఎవడైన త్రాగుబోతుగా గాని, తిండిబోతుగా గాని ఉండి తన తల్లిదండ్రులను ఎదిరించి యుంటే అతడు రాళ్ళతో కొట్టబడి చంపబడవలెను. (ద్వితీ 21:18-21) "త్రాగుబోతులును తిండిబోతులును దరిద్రులగుదురు. నిద్రమత్తు చింపిగుడ్డలుధరించుటకు కారణమగును," "తుంటరుల సహవాసము చేయువాడు తన తండ్రికి అపకీర్తి తెచ్చును" (సామె 23 : 21; 28 : 7) యేసుప్రభువు తన ఉపమానంలో చెప్పిన ధనవంతుడు, త్రాగుబోతుగాను, తిండిబోతుగాను, ఇంకా సకల దురాశలకు బానిసయై చనిపోయి నిత్యనరకంలో ప్రవేశించి తన కన్నులు పైకెత్తి భరించరాని వేదన అనుభవించిన విధమును గుర్తుచేసుకొనుము. త్రాగుడు అనే దుష్టశక్తి మానవుని బహు ఘోరముగా ప్రవర్తింపజేయును ఈశక్తి తనకుసర్వం తెలియునని, ఎంతశ్రేష్ట

మైన విషయమునైనను చులకనగా భావించును, త్రాగుబోతులు దేవుని రాజ్యములో ప్రవేశింపజాలరని, దేవుడు తన వాక్యము ద్వారా బహువిపులంగా తెలియజేసియుండెను. సారాయి అనేది మన శరీరానికి ఉపయోగపడే ఆహారపదార్థంకాదు. ఇది శరీరానికి బహు కీడుకలిగించే పానీయమై యున్నది. అంతేకాక ఇది మెదడును పాడుచేసి, ఇది సేవించేవారిని బహు హీనులుగా తయారుచేయును. త్రాగుబోతు బహు అవినీతి పరుడుగా మారిపోయి, ఏలాటి నీచకార్యం చేయటానికైనా వెనుకాడడు చివరకు, హత్యచేయడానికికూడ జంకడు. "ద్రాక్షారసము వెక్కిరింతల పాలుచేయును. మద్యము అల్లరి పుట్టించును. దానివశమైనవారందరు జ్ఞానములేనివారు." (సామె 20 : 1)

మద్యమును తయారుచేసి అమ్మువారు, దానిని సేవించువారు దేవుని దృష్టిలో దోషులైయున్నారు. "ద్రాక్షారసము త్రాగుటలో ప్రఖ్యాతి నొందినవారికి, మద్యము కలుపుటలో తెలివిగలవారికి శ్రమ" (యెషయా 5 : 22) "తమ పొరుగువారి మానము చూడవలెనని ఘోరమైన ఉగ్రతను కలిపి వారికి త్రాగనిచ్చి వారిని మత్తులుగాచేయువారికి శ్రమ" (హబ 2 : 15) "వారు సితారా స్వరమండల తంబుర సన్నాయిలను వాయించుచూ, ద్రాక్షరసము త్రాగుచూ విందు చేయుదురుగాని యెహోవా పని యోచింపరు" (యెషయా 5 : 22) 'మోసపోకుడి జారులైనను విగ్రహారాధికులైనను వ్యభిచారులైనను, ఆడంగితనముగల వారై



నను, దొంగలైనను, లోభులైనను, త్రాగుబోతులైనను, దూషకులైనను, దోచుకొనువారైనను, దేవుని రాజ్యమునకు వారసులు కానేరరు.' (1 కొరింథి 6 : 9- 0)

శరీరసంబంధమైన పాపకార్యములు బహు భయంకరమైనవి అట్టి వాటిలో కొన్ని ఇవి. "జారత్వము, అపవిత్రత, కాముకత్వము, విగ్రహారాధన, అభిచారము, ద్వేషములు, కలహము, మత్సరములు, క్రోధములు, కక్షలు, భేధములు, విమతములు; అసూయలు, మత్తతలు, అల్లరితో కూడిన ఆటపాటలు మొదలైనవి" (గలతీ 5 : 19-21) మరియు మధ్యముతో మత్తులై యుండకుడి. దానిలో దుర్వ్యాపారము కలదు. అయితే ఆత్మపూర్ణులై యుండుడి.' (ఎఫెసీ 5 : 18)

ఆత్మీయమైన దాహముతో అలమటించుచున్న ఆర్తులను యేసుప్రభువు ఈ విధంగా ఆహ్వానించుచున్నాడు "ఎవడైనను దప్పిగొనినయెడల నాయొద్దకు వచ్చి దప్పి తీర్చుకొనవలెను. నాయందు విశ్వాసముంచు వాడెవడో, లేఖనములు చెప్పినట్టు, వాని కడుపులోనుండి జీవజలనదులు పారునని బిగ్గరగాచెప్పెను" (యోహాను 7 : 37-38) దప్పిగొనిన వారలారా నీళ్లయొద్దకు రండి, రూకలు లేనివారలారా, మీరు వచ్చికొని భోజనము చేయుడి రండి రూకలు లేకపోయినను ఏమియు నియ్యకయే ద్రాక్షరసమును పాలను కొనుడి" (యెషయా 55 : 1) 'నేనిచ్చు నీళ్ళు త్రాగువాడెప్పుడును దప్పిగొనడు. నేను వానికిచ్చు నీళ్ళు నిత్యజీవము కలుగుటకై వానిలో ఊరెడి నీటిబుగ్గగా ఉండును' (యోహాను 4:14)

4. తాబేలు - THE TORTOISE: - తాబేలు సోమరితనము, బద్దకము, ప్రతీపని ఆలస్యముగాచేయుట, మాంత్రిక విద్య అను పాపములకు గుర్తుగా ఉన్నది. అవిశ్వాసమునే ఘోరపాపంయొక్క ప్రతిరూపమే మాంత్రికవిద్య "సోమరి వాని చేతులు పనిచేయనొల్లవు. వాని ఇచ్ఛ వానిని చంపును. దినమెల్ల ఆశలు పుట్టుచుండును" (సామెతలు 21:25-26) పూర్వము ఇశ్రాయేలు ప్రజలకు నాయకుడైన యెహోషువా ఆప్రజలను "మీరు పొందబోవు దేశమును స్వతంత్రించుకొనేవరకూ మీరు సోమరులుగా ఉండవద్దని హెచ్చరించెను దేవుని కార్యముల విషయంలో బద్దకముగాను, సోమరితనంలోను ఉండుట మానవస్వభావమై యున్నది. "ఇరుకు ద్వారమున ప్రవేశింప పోరాడుడి" (లూకా 13:24) అని యేసుప్రభువు చెప్పియుండెను. "వెదకుడి మీకు దొరుకును" "పరలోక రాజ్యము బలాత్కారముగా పట్టబడుచున్నది బలాత్కారులు దాని నాక్రమించుకొనుచున్నారు.." (మత్తయి 11 ; 12)

సోమరితనము, మన ఆత్మ రక్షణకు ఒక పెద్ద అడ్డుబండయై, ఆత్మీయ క్షీణతకు, చివరకు ఆత్మీయ వినాశనమును తెచ్చిపెట్టును ఇది మనలను ప్రార్థనా జీవితమునుండి దూరపరచి, దైవసంబంధమైన మర్మములను గ్రహించకుండా జేసి, ఆయన మనకిచ్చిన అమూల్యమైన వాగ్దానములను మనము పొందకుండా జేయును. చివరకు నిత్యనాశనమునకు నడిపించును. ప్రేమగల దేవుడు నిన్ను తనవైపునకు ఆహ్వా



నించుచూ, నీ హృదయమును నేడే నాకిమ్మని అడుగుచున్నపుడు, సాతానుమరోప్రక్కనుండి "ఈరోజువద్దులే! రేపు చూడవచ్చుని, లేక మరో అనుకూలమైన సమయంలో దేవుని అంగీకరించవచ్చుని" ప్రేరేపించును. ఆవిధంగా నీవు నిర్లక్ష్యం చేస్తే నీవు దేవుని యొద్దకు చేరలేవు. రక్షణలేకుండా క్రీస్తు లేకుండా నీవు స్వర్గంలో ప్రవేశించలేవు "నేడు మీ రాయన శబ్దము వినినయెడల... మీ హృదయములను కఠినపరచుకొనకుడి." (హెబ్రీ 3: 7-8) ఎంతోమంది ఈ విధంగా రక్షణ విషయంలో వాయిదాలువేసి నశించిపోవుచున్నారు. నీవు రక్షించబడుటకు నేడే అనుకూలసమయము. రేపటిదినము నీది కాకపోవచ్చు

తాబేలు బొరుసును తరచు మాంత్రిక విద్య అవలంబించువారు ఉపయోగింతురు. జీవముగల దేవునిపై విశ్వాసముంచి, ఆయనద్వారా మానవుడు తన భవిష్యత్తును నిర్ణయించుకొనుటకు బదులు, ఈ మాంత్రిక విద్య, సోది చెప్పించుకొనుట అను వానియెడల గురినిలుపుట పాపమైయున్నది. మానవుని బాధలు, దుఃఖములు, రోగములు, దిక్కులేని తనములు నివారించి సరియైన సహాయం, ఆదరణ ఇవ్వగలవాడు దేవుడుమాత్రమే అట్టి ఆపదలలో ఉన్నవారు కరుణామయుడైన దేవుని కృపకొరకు ప్రార్థించవలెనేగాని, సోది చెప్పించుకొన్నందున ఏలాంటి ప్రయోజనం ఉండదు. సోది చెప్పేవారు ఒకని దురదృష్టమును, అదృష్టముగా మార్చలేరు. అది దేవునికే సాధ్యము. "ఒకని నడత యెహోవాచేతనే స్థిర

పరచబడును.'' (కీర్తన 37:23) "మీలో ఎవడైనను రోగియై
యున్నాడా అతడు సంఘపుపెద్దలను పిలిపింపవలెను. వారు
ప్రభువు నామమున అతనికి నూనెరాచి అతనికొరకు ప్రార్థన
చేయవలెను. విశ్వాస సహితమైన ప్రార్థన ఆరోగిని స్వస్థత
పరచును. మీ పాపములను ఒకనితో ఒకడు ఒప్పుకొనుడి
మీరు స్వస్థతపొందునట్లు ఒకనికొరకు ఒకడు ప్రార్థనచేయుడి"
(యాకోబు 5 : 14-16) "తూర్పునుండియైనను, పడమటనుండి
యైనను, అరణ్యమునుండియైనను హెచ్చుకలుగదు. దేవుడే
తీర్పు తీర్చువాడు ఆయన ఒకనిని తగ్గించును. ఒకనిని హెచ్చిం
చును" (కీర్తన 75 : 6-7) దేవుడు ఇశ్రాయేలు ప్రజలకు
ఈలాగు ఆజ్ఞాపించెను. "తన కుమారునైనను తన కుమార్తె
నైనను, అగ్నిగుండ దాటించువానినైనను శకునము చెప్పు
సోదెగానినైనను మేఘశకునములనుగాని, సర్పశకునములను
గాని చెప్పువానినైనను చిల్లంగి వానినైనను, మాంత్రికుని
నైనను, ఇంద్రజాలికునినైనను కర్ణపిశాచి నడుగువానినైనను
దయ్యములయొద్ద విచారణచేయువానినైనను మీ మధ్య ఉండ
నియ్యకూడదు." (ద్వితీ 18:10-12) "... మాంత్రికులును
వ్యభిచారులును నరహంతకులును విగ్రహారాధకులును అబద్ధ
మును ప్రేమించి జరిగించు ప్రతివాడును "దేవుని రాజ్యముకు
వెలుపటనుందురు" (ప్రకటన 22 :15 "కర్ణపిశాచిగల
వారిదగ్గరకు పోకూడదు, సోదెగాండ్రను వెదకి వారివలన
అపవిత్రత కలుగజేసికొనకూడదు. నేను మీ దేవుడనైన
యెహోవాను" (లేవి 19 : 31) "వారు మిమ్మునుచూచి



కర్ణపిశాచిగల వారియొద్దకును కిచకిచలాడి గొణుగు మంత్ర
జ్ఞులయొద్దకును వెళ్ళి విచారించుడని చెప్పునపుడు జనులు తమ
దేవునియొద్దనే విచారింపవద్దా! ధర్మశాస్త్రమును ప్రమాణ
వాక్యమును విచారించుడి. ఈవాక్యప్రకారము వారుబోధించిన
యెడల వారికిఅరుణోదయము కలుగును (యెషయా 8:19-20)

ఈ చిన్న పుస్తకమును నీవు చదువుచుండగా దేవుడు
నీతో మాట్లాడుచున్నాడు. నీ పాపముల విషయమై పశ్చా
త్తాపము చెంది, నీ జీవితమును ఆయనకు సమర్పించుకొనునట్లు
దేవుడు నిన్ను ప్రేరేపించుచున్నాడు నీవట్లుచేయక తాబేలు
వంటి సోమరి స్వభావముతో, నీ హృదయములో అనేక అను
మానములు పెట్టుకొని, రక్షణ విషయంలో నిర్లక్ష్యము
చేయుచూ వాయిదాలువేసే స్థితిలో ఉంటావా నేను క్రై
స్తవుడనైనచో, నా స్నేహితులు; బంధువులు, ఇతరులు
నా విషయమై ఏమనిచెప్పుకుందురో ? నేను లోకసంబంధమైన
వినోదమునిచ్చు నాట్యములోను, విందులలోను ఆనందించే
స్థితిలో ఉండనిచో ఎట్లుండును? ఇటువంటి అల్లరితో కూడిన
ఆటపాటలను విసర్జించి, యేసుక్రీస్తునందు లభించే ఉత్కృష్ట
మైన భాగ్యాన్ని ఆశించి, ఆయన మహిమపొందుకొనే నిమిత్తం
ఆయన ఇచ్చే నిత్యజీవానందంలో పాలివారమగునట్లు మనలను
మనము సంపూర్ణముగా క్రీస్తుప్రభువునకు సమర్పించుకొంటే
మనకెంతమేలు! అప్పుడు నీవు నష్టపరచుకొన్న ఆత్మీయ
వరములన్నింటిని తిరిగి పొందగలవు. నీవు మనుష్యులకు జడిసే
స్థితిలో ఉంటే ఇంకనూ సాతాను బంధకములలోనే ఉన్నావని

గ్రహించుము. "జీవితకాలమంతయు మరణభయముచేత దాస్యమునకు లోబడినవారిని విడిపించుటకు ప్రభువు వచ్చియున్నాడు" ( హెబ్రీ 2 : 14-15 ) నీవు నీ హృదయమును, కఠినపరచుకొనుచూ, ఆలస్యముచేయుచూ ఉండిన పక్షమున అది క్రమముగా తాబేలు బొరుసుకంటె కఠినమైనదిగా తయారగును.

5 చిరుతపులి – THE LEOPARD:– ఇది బహు భయంకరమైనట్టియు, క్రూరమైనట్టియు జంతువు ఇది అసూయ, పగ, కోపము అను పాపములకు సాదృశ్యముగా ఉన్నది. కోపము అనే పాపము మానవుని హృదయంలో పనిచేసినప్పుడు అది తనతోటి మానవుని హత్యచేయుటకు సహా వెనుకాడదు క్రూరమైన కోపముగల మానవుడు, తన్ను తానే స్వాధీనపరచుకొనలేడు. తానుతలచిన కార్యము జరిగే వరకూ ఆ కోపము యొక్క రౌద్రము తగ్గదు. ఇట్టి కోపమనే భయంకరపాపము నీలో ఉన్నయెడల తక్షణమే దానినుండి సంపూర్ణమైన విడుదలకొరకు యేసుప్రభువును వేడుకొనుము "కోపమును నీకన్నుల ఎదుటికి రానియ్యకుము" "కోపము మానుము. ఆగ్రహము విడిచిపెట్టుము. వ్యసనపడకుము అది కీడుకే కారణము." ( కీర్తన 37 : 8 ) "క్రోధము క్రూరమైనది. ఆగ్రహము వరదవలె పొర్లునది కోపము ఎదుట ఎవడు నిలువగలడు ? ( సామె 27 . 4) అతిపడి కోపపడవద్దు బుద్ధిహీనుల అంతరింద్రియములందు కోపము సుఖనివాసము చేయును" ( ప్రసంగి 7 : 9; 11 : 10 ) "ఇప్పుడైతే మీరు కోవము, ఆగ్రహము... విసర్జించుడి" ( కొలస్సై 3 : 8 ).



కొందరు పిరికివారు తాము ఏదో దుష్టకార్యము చేయుటకు లేక ఒకనిమీద పగతీర్చుకొనుటకు వారిలో ధైర్యము లేక, బాగుగా త్రాగి మత్తులై ధైర్యము తెచ్చుకొందురు "వారి ద్రాక్షారసము క్రూరసర్పముల విషము. నాగుపాముల క్రూరవిషము" ( ద్వితియో 32 : 33 ) పగతీర్చుకొను స్వభావం పాపహృదయానికి మధురంగా ఉంటుంది. అయితే ఒకప్పుడు దేవుడు ప్రతిపాపమునకు ప్రతీకారంచేయకమానడు. ఒకనిమీద మనం పగతీర్చుకొన పనిలేదు "నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమించుమనియు, మీ శత్రువులను ప్రేమించుమనియు" యేసుప్రభువు చెప్పియుండెను. మనయెడల అపరాధంచేసిన వారిని మనము క్షమిస్తే దేవుడు మన పాపములను క్షమిస్తానని వాగ్దానం చేసియుండెను. ఎదుటివానిని కొరకొర చూస్తూ పగతో పండ్లుకొరుకుతూ ఉండే మనస్సుగల వానిని దేవుడు అసహ్యించుకొనును, దుష్టత్వంతో కూడిన అత్యాసలు రక్తపాతమునకు, పోరాటములకు దారితీయును. కనుక మానవ హృదయంలో నిజమైన శాంతి అంతమువరకు స్థాపించబడవలసియున్నది.

6. సర్పము – THE SNAKE:– ఆదియందు ఆదాము అవ్వలను మోసంచేసి వారిని ఏదేను తోటనుండి. దైవ సహవాసంనుండి దూరపరచినది సర్పమేగదా! పడద్రోయబడిన దేవదూత సాతానుగా మారి, అది మానవసంతతియగు ఆదాము అవ్వలపై తన అసూయను వెళ్ళగక్కింది. ఆదాము అవ్వలు లోకమును, దైవసాన్నిధ్యంలో పాలించుట సాతా

నుకు ఎంతమాత్రము ఇష్టము లేకపోయింది. ఆదాము "లూసిఫరు" పోగొట్టుకొనిన మహిమ స్థానమును పొందినందుననే, సాతాను వారిపై కత్తికట్టాడు. ఏలాగైతేనేమి, తాను తలంచిన కార్యంలో కృతార్థుడైనాడు, ఆదాము అవ్వలను దైవ సాన్నిధ్యం నుండి దూరపరచాడు. ఇట్టిసాతాను స్వభావమే అనేక హృదయములలో పనిచేయుచున్నది. ఎదుటి వారి సంతోషమును, సమాధానము, వారి సుఖజీవనమును చూచి ఓర్వలేక ఎంతోమంది అసూయతో ఏడ్చుట చూచుచుందుము. అంతేగాక వారికి చేతనైనంతమట్టుకు ఎదుటివారి ఆనందాన్ని అంధకారంగా మార్చివేయుదురు. "అసూయ పాతాళమంత కఠోరమైనది" (పరమ గీతములు 8 : 6) అసూయతో నిండిన హృదయం, అనేక దుష్టతలంపులకు నిలయమై ఎదుటివారి కొంపలు కూల్చుటకు అవసరమైతే ఖూనీలు చేయుటకు పరుగులెత్తును ఇట్టివారు తమకేవిధమైన ఫలితము లేకున్నను ఎదుటివారి పతనమును కోరుచుందురు. ఏవో అసూయమాటలు చెప్పి, జరిగే వివాహాలు చెడగొట్టుట, ఎదుటివారి పేరుప్రతిష్టలు పాడుచేయుట మొదలైన సందర్భములెన్నిటో ఇట్టి దౌర్భాగ్యులు జరిగించుట మనము ఎరుగుదుము. దైవభక్తులమని చెప్పుకొనుచూ దేవుని సేవను చేసే సువార్తికులలోనే ఇట్టి హీనమైన గుణం పనిచేయుట ఆశ్చర్యం కలిగించదా! ఎవరైనా సేవకుడు, లేక సహోదరుడు తనకంటే మంచిపేరు సంపాదించుకొంటే లేక తన సేవద్వారా అనేకులను ఆకర్షించుకొంటే, చూచి సహించలేక, వారిపై



అనేక నిందలు మోపే సువార్తికులు, పాష్టర్లు ఎంతోమంది గలరు. వీరు ఆదిలో దేవుని పరిశుద్ధతను, సేవను ఎంతో ప్రేమించిన వారైనను, పరిశుద్ధాత్మచేత నింపబడిన వారైనను, చివరకు అసూయ అనే భయంకర పాపంచేత పట్టబడి, వారితోపాటు వారిసేవను కూడా నిష్ప్రయోజనమైనదిగా చేయుచున్నారు.

**7. కప్ప – THE FROG :-** ఇది లోభత్వము, ధనాపేక్ష అను పాపములకు సాదృశ్యముగా ఉన్నది. ధనాపేక్ష సమస్తమైన కీడులకు మూలమని (1 తిమోథి 6.10) గ్రహించుచున్నాము కాంగోదేశమునందు ఒక జాతికప్పలు వందలకొలది చీమలను తిను అలవాటు కలదు. అవి తృప్తిలేనివై ఎడతెగకుండా తిని చివరకు, శరీరము పగిలి చనిపోవును. లోభియైన మానవుడు ఎదుటివాని అక్కరలలోగాని, పేదవానికి సహాయముచేయుటలోగాని తనచేతిని చాపలేడు. గాని నిరంతము తృప్తిలేనివాడై ధనమునకు ధనము కూర్చుకొనుచూ, జీవించును. అయితే ఆ ధనము నశించేదనియు, దానిని సద్వినియోగపర్చకపోయిన దానిని చిమ్మటలు, త్రుప్పును తిని వేయునని అతడు గ్రహించలేడు. "భూమిమీద మీకొరకు ధనమును కూర్చుకొనవద్దు. ఇక్కడ చిమ్మటయు తుప్పును తినివేయును. దొంగలు కన్నము వేసి దొంగిలెదరు... నీధనమెక్కడ ఉండునో అక్కడనే నీ హృదయముండును (మత్తయి 6 : 19-22) ఆకాను, బంగారమును, వెండిని, విలువైన వజ్రములను, వస్త్రములను ప్రేమించినందువలననే

తన కుటుంబముతో సహా అతడు నాశనము పొందెను (యెహోషువ 7) యేసుప్రభువు శిష్యులలో ఒకడైన యూదా ఇస్కరియోతు ఈ ధనాపేక్షకు గురియగుట వలననే, తన యజమానికి ద్రోహంచేసి, తనకుతానే ఉరిపోసుకొని మరణించెను. ధనమేగాక, బంగారము మరియు, ధనమును ప్రేమించుటయు కూడా, మానవ హృదయంలో పనిచేసి గొప్ప కీడుకు కారణమగుచున్నది.

వేలాది ప్రజలు ఈ ధనాపేక్షవలన బంధించబడి, ఒకేసారిగా కొన్ని లక్షలు సంపాదించవలెననే అత్యాశతో, జూదము, గుర్రపు పందెములు, కుక్కల పందెములు, మొదలైన వాటివైపుకు పరుగులెత్తి తమ కుటుంబములను దుఃఖ సాగరములో ముంచుచున్నారు. ఈ ధనాపేక్ష ఒక్కొక్కప్పుడు వారిని, దొంగతనములకు, హత్యలకు, ఆత్మహత్యలకు, అనేక బాధలకు గురిచేయుచున్నది. ధనాపేక్షయు, లోభత్వమును వివిధ ప్రత్యేక సహచరులను కలిగియున్నవి.

పేరుప్రఖ్యాతులు కలిగి జీవించవలెనను ఆశ, ఇతరులపై రాజకీయంగా, సాంఘికముగా పెత్తనం చెలాయించాలనే అపేక్ష, పేదలకు ధనాశచూపి వారిపై నిరంకుశంగా ప్రవర్తించాలనే ఆశ, మతసంబంధముగా ప్రఖ్యాతి చెందవలెననే ఆశ, దైవభీతిలేకున్నను, ఎక్కువగా, మత కార్యక్రమములలో ముందుకు రావాలనే ఆశ, ఇతరులెవ్వరూ తనకంటె ఏ విషయంలోను ముందుకురాకూడదనే ఈర్ష్యతో, ఎదుటి వారిని ఆటంకపరచే జీవితం ( మార్కు 9 : 38 ) మొదలైనవి,



ధనాపేక్ష, లోభత్వములకు సహచరులే! యేసుప్రభువు ఈలాగు చెప్పెను. "మీరు ఏవిధమైన లోభమునకు ఎడమియ్యక జాగ్రత్తపడుడి. ఒకనికి కలిమి విస్తరించుటవలన అది వాని జీవమునకు మూలము కాదు" ( లూకా 12 : 15 ) ధనవంతుడైన ఒక బుద్ధిహీనుని గూర్చి ఈవిధంగా చెప్పబడినది. "ఒక ధనవంతుని భూమి సమృద్ధిగా పండెను. అప్పుడతడు నాపంట సమకూర్చుకొనుటకు నాకు స్థలము చాలదు గనుక నేనేమి చేతునని తనలోతాను ఆలోచించుకొని నేనీలాగు చేతును; నా కొట్లు విప్పి వాటికంటె గొప్పవాటిని కట్టించి అందులో నా ధాన్యమంతటిని నా ఆస్తిని సమకూర్చుకొని నా ప్రాణముతో ప్రాణమా! అనేక సంవత్సరములకు విస్తారమైన ఆస్తి నీకు సమకూర్చబడియున్నది సుఖించుము, తినుము, త్రాగుము, సంతోషించుమని చెప్పుకొందు ననుకొనెను. అయితే దేవుడు వెర్రివాడా! ఈ రాత్రి నీ ప్రాణము నడుగుచున్నాను నీవు సిద్ధపరచినవి ఎవనివగునని అతనితో చెప్పెను. దేవుని యెడల ధనవంతుడు కాక తనకొరకే సమకూర్చుకొనువాడు ఆలాగుననే యుండునని చెప్పెను ( లూకా 12 : 16-21 ) "ఒకడు సర్వలోకమును సంపాదించుకొని తన ప్రాణమును పోగొట్టుకొనుట వానికేమి ప్రయోజనము." ( మార్కు 8 : 36 ) "ఏమితిందుమో అని మీ ప్రాణమును గూర్చియైనను, ఏమి ధరించుకొందుమో అని మీ దేహమును గూర్చియైనను చింతింపకుడి... మీరైతే ఆయన రాజ్యమును వెదకుడి, దీనితోకూడా ఇవి మీ కనుగ్రహింపబడును... మీ ధన

మెక్కడ ఉండునో అక్కడనే మీ హృదయము ఉండును.
(లూకా 12:21-34).

**8. సాతాను - SATAN:-** సాతాను అబద్ధికులందరికి
జనకుడైయుండి అనేకులను అబద్ధికులుగా చేయుచున్నాడు.
ఇతడే మానవహృదయములను పాలించు పాలకుడుగా ఉండి
అనేక పాపకార్యములను చేయుటకు మానవులను ప్రేరేపించు
చున్నాడు "మీరు మీ తండ్రియగు అపవాది సంబం
ధులు మీతండ్రి దురాశలు నెరవేర్చగోరుచున్నారు. ఆది
నుండి వాడు నరహంతకుడైయుండి సత్యమందు నిలిచినవాడు
కాడు. వానియందు సత్యమేలేదు వాడు అబద్ధమాడునపుడు
తన స్వభావము ననుసరించియే మాటలాడును వాడు అబద్ధి
కుడును అబద్ధమునకు జనకుడునైయున్నాడు" (యోహాను 8 41)
అబద్ధము అనునది చిన్నదైనను, పెద్ద అబద్ధము ఆడినంత
చెడ్డదే అగును అబద్ధము మాటలద్వారా, వ్రాతలద్వారా,
క్రియలద్వారా ఆడవచ్చును వేషధారణ అనునది కూడా ఒక
విధమైన అబద్ధమే ఎందుకంటే వేషధారి లేనిది ఉన్నట్లు
నటించును. "దేవుడెన్నడును అబద్ధికుడు కాడు. అట్లే క్రైస్త
వుడు కూడా అబద్ధమును విసర్జించవలెను. (తీతు 1:2)
"ఆయనతో కూడా సహవాసము గలవారమని చెప్పుకొనుచు
చీకటిలో నడిచినయెడల మన మబద్ధమాడుచూ సత్యము
జరిగింపకుందుము" (1 యోహాను 1:6) "కుక్కలును మాంత్రి
కులును, వ్యభిచారులును, నరహంతకులును, విగ్రహారాధ
కులును, అబద్ధమును ప్రేమించి జరిగించు ప్రతివాడును వెలు



పట నుందురు (ప్రకటన 22:15) "లేనివాటిని పలుకు అబద్ధ
సాక్షియు, కల్లలాడు నాలుకయు యెహోవాకు అసహ్యము"
(సామెతలు 6:19).

**9. నక్షత్రము - THE STAR:-** నక్షత్రము మానవ
హృదయమందలి మనస్సాక్షికి గుర్తుగా ఉన్నది ఇచ్చట ఇది
బహుకలుషితముగాను, అపవిత్రతతోను నిండియున్నది. ఇది
ఎడతెగని అంధకారములో మునిగి అంధత్వమువలన మార్గము
తప్పిన స్థితిలో ఉన్నది మరియు తాను జరిగించిన అంధకార
కార్యముల నిమిత్తం తీర్పుపొందుటకు సిద్ధముగా ఉన్నది. ఈ
మలినమగు మనస్సాక్షి ఒక్కొక్కప్పుడు ప్రశాంతముగాను,
కొన్ని సందర్భములలో అల్లకల్లోలముగాను ఉండును. ఇది
క్షమించబడవలసి వచ్చినపుడు నేరము మోపి, సాకులు చెప్పును.
ఇట్లు సాకులు చెప్పినంతవరకు దీనికి క్షమాపణ దొరకదు.
బాగుగా కాలిన ఇనుపముక్కతో వాతవేసినట్లు ఈమనస్సాక్షి
వాతవేయబడినదై, విశ్వాసమును బొత్తిగా కోల్పోయి,
కలుషితమై అబద్ధముతోను, వేషధారణతోను నిండి భ్రష్టమైన
స్థితిలో ఉన్నది. (1 తిమొథి 4 1-2; హెబ్రీ 10.22)

**10 కన్ను - THE EYE:-** ఇది దేవుని కన్ను
మానవహృదయ రహస్యములన్నింటిని పరిశోధించగల ప్రకాశ
నేత్రము. ఈ ప్రకాశనేత్రమునకు మరుగైనదేదియు ఉండదు
దేవుడు సమస్తము తెలుసుకొనగలడు కనుగొనగలడు.
మానవహృదయంలో అతి రహస్యంగా దాగియున్న ఏ కార్య
మైనను ఈ కన్నుకు మరుగుగా ఉండజాలదు ఒకవేళ నీవు

ఒక పాపమును కటిక చీకటిలో చేసినను, మానవ సంచారమే లేని దట్టమైన అరణ్యములో చేసినను, లోతైన గుహలో చేసినను, మరి ఎక్కడ చేసినను దేవుడు దానిని చూడగలడు (ఈ పటమునందలి కన్ను మానవుని ముఖ విధానమునకు అనుగుణముగా నున్నది)

**11. అగ్నివంటి చిన్న చిన్న నాలుకలు – THE LITTLE TONGUES OF FIRE:** ఈ హృదయము వెలుపల ఆవరించియున్న అగ్నివంటి చిన్న చిన్న నాలుకలు, పాపి హృదయముచుట్టూ ఆవరించియున్న దేవుని ప్రేమకు గుర్తుగా ఉన్నవి. దేవుడు పాపమును ద్వేషించి, పాపిని ప్రేమించుచున్నాడు. పాపి తన పాపములో మరణించుట దేవునికి ఇష్టములేదు. అతడు మారుమనస్సు నొంది రక్షించబడి జీవములో ప్రవేశించవలెననియే ప్రభువు కోరుచున్నాడు. పాపులను రక్షించుటకే యేసుప్రభువు అవతరించెను. ఒక్క పాపి మారుమనస్సు పొందితే పరలోకములో ఎంతో ఆనందం. ఈ అగ్ని నాలుకలు యేసుక్రీస్తు ప్రభువు మానవ పాపప్రాయశ్చిత్తార్థమై కార్చిన అమూల్య రక్తమునకు కూడా సాదృశ్యముగా ఉన్నవి. "యేసు లోకపాపములను మోసికొనిపోవు దేవుని గొఱ్ఱెపిల్లయై యున్నాడు."

**12. దేవదూత – THE ANGEL:-** దేవదూత దేవుని వాక్యమునకు సాదృశ్యమైయున్నది స్వర్గమైనవాటిని నమ్ముకొని, పాపభారముతో కృంగియున్న స్త్రీ పురుషులతో దేవుడు మాట్లాడుటకు కోరుచున్నాడు. ప్రతివారు పశ్చా



త్తాపము నొంది, దేవుని వెలుగును, ప్రేమను తమ హృదయములలోనికి ఆహ్వానించిన వారు దేవునితో సహవాసం కలిగియుందురు.

**13. పావురము – THE DOVE:-** ఇది పరిశుద్ధాత్మకు గుర్తుగా ఉన్నది ఈ సత్యస్వరూపియగు పరిశుద్ధాత్మ శక్తి పాపియొక్క రోతిహృదయాన్ని నీతిని, తీర్పును బయలుపరచుచున్నది. ఈ పటములో పరిశుద్ధాత్మ వెలుపల ఉన్నట్లు చూడగలము. పాపము నివశించేచోట పరిశుద్ధాత్మ ఎంత మాత్రము నిలువదు.

ఈ పటమును దానియొక్క వివరణయు నీ హృదయ స్థితిని బయలుపరచిన యెడల, ఇప్పుడే నీ హృదయమును తెరచి, దేవునికి మొరపెట్టుము. ఆయన వాక్యమనే కాంతిని నీ హృదయములోనికి రానిమ్ము. "ప్రభువైన యేసుక్రీస్తునందు విశ్వాసముంచుము. అప్పుడు నీవు రక్షించబడుదువు దేవుడు నీయెడల ఆశకలిగియున్నాడు, నూతన హృదయమును, నూతన ఆత్మను, నీకిచ్చుటకు వాగ్దానము చేసియున్నాడు. దేవుడేవిధముగా నీకు నూతన హృదయమును అనుగ్రహించునో రెండవ పటమునందు వివరించబడియున్నది.

# రెండవ పటము

## THE SECOND PICTURE

ఈ పటము దేవునియందాశక్తి కలిగి ఆయనను వెదకుటకు ప్రారంభించిన పశ్చాత్తాపముతో కూడిన మానవ హృదయమును సూచించుచున్నది. దేవదూత ఒకచేతితో ఖడ్గమును పట్టుకొనియున్నది ఈఖడ్గము దేవుని వాక్యమునకు గుర్తు ఈ వాక్యము సజీవమై బలముగలదై రెండంచులుగల ఎటువంటి ఖడ్గముకంటెను వాడిగానుండి ప్రాణాత్మలను, కీళ్ళను మూలుగను, విభజించునంతమట్టుకు దూరుచూ హృదయము యొక్క తలంపులను ఆలోచనలను శోధించుచున్నది. (హెబ్రీ 4:12) దేవుని వాక్యము ఇతనికి "పాపమునకు జీతము మరణమని"యు "మనుష్యులొక్కసారే మృతిపొందవలెనని నియమింపబడెను. ఆ తరువాత తీర్పుజరుగును"అనియు జ్ఞాపకముచేయుచున్నది. (హెబ్రీ 9:27) పాపులును అవిశ్వాసులును అగ్నిగంధకములతో నిండిన గుండమునందు వేయబడుదురు. దేవదూత మరొకచేతితో నొక కపాలమును (మనుజుని పుర్రె) పట్టుకొనియున్నది. ఈ కపాలము ప్రతిమానవునికి మరణమున్నదని తెలుపుచున్నది, మనమెంతో ప్రేమించి, పోషించుచున్న ఈ శరీరము, దుస్తులిచ్చి, ఆహారమిచ్చి, ఎంతో శ్రద్ధతో కాపాడుచున్న ఈ శరీరము కోరిన ఆశలన్నింటిని తీర్చుకొనుటకు, అనుగుణాగా, నడిపించబడిన ఈ శరీరము ఒక తృటిలో మరణించి నాశనమగుచున్నది కాని, మనలో



ఉన్న ఆత్మమాత్రము నిరంతరము జీవించునదిగానై, దేవుని న్యాయపీఠము ఎదుట ఒకనాడు నిలబడవలసియున్నది.




**2. పాపపుఒప్పుదలయు, లోబడేగుణముగలహృదయం**

THE CONVICTED AND YIELDING HEART

ఈ పటమునందలి వ్యక్తి తన పాపముల విషయమై పరితపించి, దేవునియందు ప్రేమగలవాడై తన హృదయమును

ఆయనకొరకు తెరచినవాడుగా ఉన్నాడు, పరిశుద్ధాత్మ ఈ పాపహృదయాలలో ప్రకాశింప నారంభించినది. దేవుని వెలుగు, ఈ హృదయమనే మందిరంలో ప్రవేశించి దానిలోని పాపాంధకారాన్ని పారద్రోలింది. దేవుని వెలుగురాగానే ఇక చీకటి పోవలసిందే! వివిధ పాపములకు సాదృశ్యంగా ఉన్న జంతువులన్నీ పారిపోయినవి ప్రియచదువరీ! నీ పాపహృదయానికి ప్రకాశం కావలెనా? లోకమునకు వెలుగైయున్న యేసుప్రభువును ఇప్పుడే నీ హృదయములోనికి రానిమ్ము. అప్పుడు నీలోనున్న అంధకారం, అంధకార కార్యములు అంతరించిపోవును. నీలోగల వివిధ పాపనైజములన్నీ పారిపోవును. "నేను లోకమునకు వెలుగైయున్నాను. నన్ను వెంబడించువాడు చీకటిలో నడువక జీవపు వెలుగు కలిగియుండును" అని యేసు చెప్పెను (యోహాను 8:12)

నీ హృదయములోని పాపపు చీకటిని, నీస్వనీతితో కూడిన కార్యములవల్లగాని, స్వప్రయత్నములవల్లగాని, నీస్వజ్ఞానమువల్లగాని, మరి ఏ మానవుని తత్వజ్ఞానమువల్లగాని పారద్రోల లేవు. ఇందుకు సులువైన, నిశ్చయమైన, త్వరలో ఫలితమునిచ్చే అతిశ్రేష్టమైన మార్గము, వెలుగైన యేసుప్రభువును హృదయంలోనికి ఆహ్వానించుటయే. అప్పుడే మానవ హృదయములోని పాపాంధకారము పటాపంచలౌతుంది. రాత్రి భాగంలో చంద్రుడు నక్షత్రాలు కొంతవరకు మనకు వెలుగునిస్తాయి. కాని సూర్యోదయం కాగానే, చీకటి అంతా అంతరించి పోతుంది. దానితోపాటు అంతవరకు ప్రకాశించిన చంద్ర



నక్షత్రాలు కాంతివిహీనం అవుతాయి. యేసుప్రభువు తేజోమయుడైన నీతి సూర్యుడైయున్నాడు. ఒకప్పుడు యేసుప్రభువు యెరూషలేము దేవాలయములోనికి ప్రవేశించుచూ, అచ్చటగల ఎద్దులు, గొర్రెలు, పావురములు అమ్మువారిని పారద్రోలి, డబ్బులు మార్చువారిని చెదరగొట్టి వారి పీఠములను పడద్రోసి "నా మందిరము ప్రార్థనమందిరమనబడును అని వ్రాయబడియున్నది. అయితే మీరు దానిని దొంగల గుహగా చేసియున్నారని" గద్దించెను. (మత్త 21:13)

నీ హృదయమే దేవుని ఇల్లును, దేవాలయమునై యున్నది. ఆయన దానిలో నివసించుటకు ఆశించుచున్నాడు. దానిని పవిత్రపరచి తన వెలుగుచేతను, క్షేమచేతను, ఆనందము చేతను, నింపుటకు నిరీక్షించుచున్నాడు. యేసుప్రభువు మన పాపములను క్షమించువాడు మాత్రమేగాక, పాపమునుండియు, పాపపుశక్తినుండియు విడిపించువాడై యున్నాడు. కుమారుడు (యేసు) మిమ్మును స్వతంత్రులనుగా చేసినయెడల మీరు నిజముగా స్వతంత్రులై యుందురు." (యోహాను 8:36).

# మూడవ పటము

## THE THIRD PICTURE

ఈ మూడవ చిత్రము నిజముగా మారుమనస్సునొందిన పాపియొక్క హృదయస్థితిని చూపుచున్నది. ఇప్పుడతడు తన పాతజీవితములోని ఘోర పాపముల భయంకరత్వమును, రక్షకుడైన క్రీస్తు ఆ పాపములనిమిత్తమై సిలువలో మరణించిన విధమును గ్రహించ గలుగుచున్నాడు. దేవదూత అతనికి సిలువను, దేవుని వాక్యమును బయలుపరుచుచున్నపుడు, అతని హృదయములో వేదన బయలువెడలి, తానుచేసిన పాపముల విషయమై బహుగా కలవరము చెంది దుఃఖించుచున్నాడు. యేసుక్రీస్తుద్వారా బయలు పర్చబడిన దేవుని మహోన్నతిమైన ప్రేమను తలచి, తలచి, అతని హృదయము నీరగునంతగా పశ్చాత్తాపుడైనాడు. దేవుని గొప్ప ప్రేమద్వారా తన ఘోర పాపములు ఎలాగు క్షమించబడెనో గ్రహించగలిగాడు. రక్షకుని ద్వారా తన శిక్ష తొలగిపోయినందుకును, తన పాపములకు బదులుగా యేసుప్రభువు తన్నుతాను అప్పగించుకొన్నందుకును కృతజ్ఞత కలిగియున్నాడు యేసుప్రభువు నిజముగా మన పాపములకొరకు గాయపర్చబడి, తలపై ముండ్లకిరీటము కొట్టబడి కాళ్ళు, చేతులలో మేకులు గ్రుచ్చబడి, సిలువలో మరణించెను ఈ సత్యాన్ని మార్పుచెందిన హృదయము మాత్రమే తేటగాను, లోతుగాను గ్రహించ గలుగుచున్నది. ఇట్టివ్యక్తి దేవుని వాక్యమును చదువుచున్నపుడు, తన్ను



తాను అద్దములో చూచుకొనునట్లు, తన హృదయమును తేటగా చూడగలడు. అంతేగాక అతడు దేవునికి గతంలో




**3. మారుమనస్సునొందిన హృదయము**

**THE REPENTING HEART**

ఎంతగా దూరమైనాడో, దైవఆజ్ఞలను తానెంతగా మీరి ప్రవర్తించాడో, గ్రహించగలుగుతాడు, దైవ చిత్తానుసార

నైన దుఃఖముచే అతని హృదయము నింపబడి, తన విరిగి నలిగిన హృదయాన్ని దేవుని సన్నిధిలో కుమ్మరించును. కన్నీటితో కరుణగల యేసును, ప్రార్థించును, దేవుని ప్రేమయు, సమాధానమును అతని హృదయములో నిలచియుండగా, "ఆయన కుమారుడైన యేసురక్తము ప్రతీ పాపమునుండి మనలను పవిత్రులనుగా చేయును" (1 యోహాను 1:7) అను వచన భావమతనికి బయలుపర్చబడును, "విరిగిన హృదయము గల వారికి యెహోవా ఆసన్నుడు నలిగినమనస్సు గలవారిని ఆయన రక్షించును" (కీర్తన 34 : 18) "ఎవడు దీనుడై నలిగిన హృదయముగలవాడై నా మాటవిని వణకుచుండునో వానినే నేను దృష్టించుచున్నాను" (యెషయా 66:2) అనువచనములు కూడా ఇతనికి స్ఫురించును. పరిశుద్ధాత్మ అతని చెవులలో చల్లగా యేసుచెప్పిన "నా కుమారుడా! (కుమార్తే!) నీ పాపములు క్షమించబడియున్నవి. సంతోషించి ఆనందించుము" అనుమాట వినిపింపజేయును. అతడు నిత్యము సిలువను ధ్యానించుచూ, తనపాపములకొరకు యేసు ఎట్లు రక్తమును చిందించెనో తలపోయుచుండును. అతని పాప భారమంతయు యేసుప్రభువు మోసినందున, అతడు ఆభారము నుండి విడుదలపొందెను. అతని వ్యసనములు, దుఃఖములు అంతర్థానమయ్యెను. "మన అతిక్రమములను బట్టి అతడు గాయపర్చబడెను. మన దోషములనుబట్టి నలుగగొట్టబడెను. మన సమాధానార్థమైన శిక్ష అతనిమీదపడెను. అతడు పొందిన దెబ్బలచేత మనకు స్వస్థత కలుగుచున్నది...



యెహోవా మన అందరిదోషములు అతనిమీద మోపెను" (యెషయా 53).

సుద్దీకరించబడిన హృదయాన్ని పరిశుద్ధాత్మయు, దైవ ప్రేమయు స్వాధీనపరచుకొనును అట్టి హృదయము తనకట్టి మహాభాగ్యాన్ని ప్రసాదించిన యేసు రక్షకుని, ఆయన సిలువలో కార్చిన విలువైన రక్తాన్ని; విశ్వాసంతో తలపోయుచుండును. అతడు నిశ్చయముగా యేసునందు విశ్వాసముంచినవాడై నశింపక నిత్యజీవమునకు వారసుడగును (యోహాను 3 : 16) "దేవునికృపా మహదైశ్వర్యమును బట్టి ఆ ప్రియునియందు (యేసు) ఆయన రక్తమువలన మనకు విమోచనము అనగా మన అపరాధములకు క్షమాపణ మనకు కలిగియున్నది" (ఎఫెసీ 1 : 7) గతంలోని శరీరదురాశలన్నీ ఈ హృదయంనుండి మాయమై, ఆత్మీయమైన, దైవ సంబంధమైన జీవితం ఆరంభమగును. లోకమును దాని ఆశలు అంతరించిపోయి, దైవసంబంధమైన ఆశలే ఈ హృదయంలో ప్రకాశించును. ఈ మూడవ పటములో వివిధ పాపములకు సాదృశ్యములైన జంతువులు హృదయమునుండి వెలుపలకు నెట్టబడినవి. సాతాను మాత్రము, తన పాత స్థలాన్ని మరచిపోలేక, ఆ హృదయంలో ప్రవేశించటానికి మరొకతరుణము వచ్చునేమో అని వెనుదిరిగి నిరీక్షించుచున్నాడు అందుచేతనే యేసుప్రభువు మీరు మెలకువగా ఉండి ప్రార్థించుడి అని మనలను హెచ్చరించియున్నాడు. సాతానును ఎదురించుడి వాడు మీ యొద్దనుండి పారిపోవును అజాగ్రత్తగా ఉంటే మరలా సాతాను ప్రవేశించవచ్చును.

# నాల్గవ పటము

## THE FOURTH PICTURE

క్రీస్తుప్రభువుని మహాత్యాగముద్వారా సంపూర్ణమైన శాంతిని, విమోచనమును పొందిన క్రైస్తవుని హృదయస్థితిని ఈనాల్గవ పటము సూచించుచున్నది ఇట్టి హృదయము ప్రభువైన యేసుక్రీస్తు సిలువయందు తప్ప మరి దేనియందును అతిశయించదు. దీనివలన ఇతడు లోకమునకును, ఇతనికి లోకమును సిలువ వేయబడియుండును (గలతీ 6 : 14) మనము మన పాపముల విషయమై మరణించి నీతివిషయమై జీవించుటకొరకే యేసుప్రభువు సిలువలో మరణించియుండెను (1 పేతు 2 : 24) క్రైస్తవుడు లోకము విషయంలో చనిపోవలెను. అనగా లోకాశలు నెరవేర్పు విషయంలో మరణించిన వానివలె ఉండవలెను. "ఆత్మానుసారముగా నడచుకొనుడి. అప్పుడు మీరు శరీరేచ్ఛను నెరవేర్చరు" (గలతీ 5 : 16–25).

ఈ పటమునందు యేసుప్రభువు సిలువలో మేకులతో బంధించబడి వ్రేలాడుచుండుట చూచుచున్నాము. ఆయన వస్త్రములు దోచుకొనబడినవి. ఆయన శరీరమంతయూ కొరడా దెబ్బలచే గాయపరచబడినది; మన పాపములనిమిత్తమాయన అనేక విధములుగా హింసించబడి యుండెను మనం చేసిన సిగ్గుమాలిన పాపముల విషయమై ఆయనముఖముమీద ఉమ్మివేయబడి అపహాసింపబడ్డాడు, హేరోదును అతని జను



లును ఆయనను హేళనచేసిరి ఆయనను అనేక విధములుగా హింసించిన తరువాత, ఆయన తలమీద బంగారు కిరీటానికి




4. క్రీస్తుతో సిలువ వేయబడుట

CRUCIFIED WITH CHRIST

బదులు ముండ్లకిరీటాన్ని, ఆయన కుడిచేతికి రాజదండము నకు బదులు రెల్లుకర్రను ఇచ్చి, ఆయన ఎదుట కపటముగా సాగిలపడి "యూదులరాజా నీకు జయం" అని హేళనచేసిరి.

ఆ రెల్లుకర్రతోనే ఆయన తలమీద కొట్టిరి. అనేక విధములుగా ప్రభువును హింసించి చివరకు ఆయనను సిలువవేసిరి.

క్రైస్తవులనేకులు ప్రార్థనామందిరములలో చేరి ప్రభు రాత్రి భోజన సంస్కారము నాచరించుచూ, పాటలుపాడుచూ, పైకి భక్తిగలవారివలె జీవించి, పాపపు దాస్యము నుండి పూర్తిగా విడుదలపొందక కాలముగడిపేస్థితిలో ఉందురు. అట్టి వారు ప్రభువును మరలా సిలువవేయుచూ ఆయన గాయములను రేపుచున్నారని గ్రహించవలసియున్నది "ప్రభువా ప్రభువా అని నన్ను పిలుచు ప్రతివాడు పరలోక రాజ్యములో ప్రవేశింపడుగాని పరలోకమందున్న నాతండ్రి చిత్తప్రకారము చేయువాడే ప్రవేశించును" (మత్తయి 7 : 21-27).

ఈ పటములో ఇస్కరియోతు యూదాకు చెందిన డబ్బుసంచి కూడా గలదు. ఇతనికి ధనాపేక్ష ఎక్కువగా ఉన్నందున హృదయాంధకారముతో నిండినవాడై యేసుప్రభువును ముప్పది వెండిరూకల కొరకు అప్పగించెను, ఇంకా ఈ పటములో ఉన్న లాంతరు, గొలుసులు మొదలైనవి యేసుప్రభువును బంధించుటకు వెళ్ళిన రాత్రి రాణువవారు ఉపయోగించిన సాధనములు "నా వస్త్రములు వారు పంచుకొనుచున్నారు. నా అంగీకొరకు చీట్లు వేయుచున్నారు' (కీర్తన 22 : 18) అని ప్రవచింపబడిన ప్రకారము యేసుప్రభువుని వస్త్రములు పంచుకొనుటకు సైనికులు ఉపయోగించిన చీట్లు (ఘనాకారముగా ఉండు చిన్నచిన్న బిళ్ళలు లేక పాచికలు) కూడా ఈ పటములో మనము చూచుచున్నాము.



ప్రభువువద్ద ఉన్న సమస్తము లాగుకొని మమ్మును పాలించుటకు, మాకు చెప్పుటకు ఈ మనుష్యుడు మాకక్కరలేదు. అని ఆయనను విసర్జించిరి.

దేవునిద్వారా సర్వ సదుపాయములు, సమస్త సంపదలు పొందవలెనని ప్రతీమానవుడు ఆశిస్తూ ఉండుట సహజం గాలి, వెలుతురు, వర్షము యింకా ఎన్నో పొందుటకు మానవుడు దేవునివైపు చూస్తాడు. కాని ఆయన చిత్తమునకు మాత్రము లోబడడు. తన జీవితాన్ని దేవునికి అంకితం చేయలేడు. కొందరికి అక్కర, ఇక్కట్లు వచ్చినపుడు మాత్రమే దేవుని జ్ఞాపకం తక్కిన సమయాల్లో దైవచింతనే కన్పించదు.

ఈ పటములో బళ్ళెముకూడా ఉన్నది ఆ బళ్ళెముతో ఒకసైనికుడు సిలువలో వ్రేలాడుచున్న యేసుప్రభుని ప్రక్కలో పొడవగా, ఆ గాయమునుండి రక్తమును నీళ్ళును స్రవించినవి (యోహాను 19 : 34-37) కోడి పేతురును గుర్తుచేయుచున్నది. కోడి కూయకముందు పేతురు యేసును ఎరుగనని బొంకినాడు తరువాత పశ్చాత్తాపముతో కన్నీరు కార్చినాడు. ప్రియస్నేహితుడా నీవు ప్రభువును నీ మాటలద్వారా క్రియలద్వారా అంగీకరించి, ఆయన సన్నిధిలో పశ్చాత్తాపపడితివా! లేక మనుష్యుల ఎదుట ఆయనను ఒప్పుకొనుటకు సిగ్గుపడుచున్నావా? "మనుష్యుల ఎదుట నన్ను ఒప్పుకొనువాడెవడో పరలోకమందున్న నా తండ్రియెదుట నేను వానిని ఒప్పుకొందును. మనుష్యుల ఎదుట ఎవడు నన్ను ఎరుగననునో వానిని

పరలోకమందున్న నా తండ్రి యెదుట నేనెరుగనందును" (మత్త 10 : 32-33) అనియు, "తన సిలువ నెత్తుకొని నన్ను వెంబడింపనివాడు నాకు పాత్రుడు కాడు" (మత్తయి 10.38) అనియు ప్రభువు ఖండితముగా చెప్పియుండెను. రక్షణ బండయగు క్రీస్తు సన్నిధిలో నిలుచువారు ధన్యులు.

### ROCK OF AGES

నిత్యమౌ శిలా, నను
నీదు ప్రక్క దాచుము
నీదు ప్రక్క బారిన
నీరు రక్తమందున
పాపఘంబు ముంచుము
నన్ను శుద్ధిచేయుము.



# ఐదవ పటము

## THE FIFTH PICTURE

ఈ పటము దేవుని మితిలేని కృపాకటాక్షములద్వారా శుద్ధీకరించబడి, విమోచించబడిన హృదయస్థితిని తెలుపుచున్నది. ఇట్టి హృదయమే దేవునికి నివాసయోగ్యమైనట్టిదియు, తండ్రి, కుమార, పరిశుద్ధాత్మలకు నిలయమైనట్టిదియునై యున్నది. "ఒకడు నన్ను ప్రేమించువాడైతే నా మాట గైకొనును. అప్పుడు నా తండ్రి వానిని ప్రేమించును. మేము వానియొద్ద నివాసము చేతుము. (యోహాను 14 : 28) "దేవుడు క్రీస్తుద్వారా మానవుని స్థితిని హెచ్చించి, సింహాసనము నెక్కించెను" (లూకా 1 : 52).

ఇప్పుడీ హృదయము నిజమైన దేవుని ఆలయమై యున్నది పాపము పారద్రోలబడింది. వివిధ పాపములకు సాదృశ్యముగా ఉన్న జంతువులు, అబద్ధికులకు జనకుడైన సాతాను, దూరపర్చబడినాడు. ఈ హృదయము సత్యస్వరూపియగు పరిశుద్ధాత్మకు నిలయమైయున్నది. అసహ్యకరమైన పాపపు పాన్పుకు బదులు పరిశుద్ధాత్మ ఫలములచే ఈహృదయం ఎంతో అందముగా కన్పించుచున్నది. ఆత్మఫలములగు ప్రేమ, సంతోషము, సమాధానము దీర్ఘశాంతము దయాళుత్వము, మంచితనము, విశ్వాసము, సాత్వికము, ఆశానిగ్రహము, అనునవి ఈహృదయములో ఫలించియున్నవి. అనగా ఈ మనుష్యుడు నిజమైన ద్రాక్షవల్లియైన యేసుక్రీస్తుయొక్క

ఫలించే తీగగా ఉన్నాడు. ఇతడిట్లు ఫలించుటలోగల రహస్య మొక్కటియే క్రీస్తు యేసుతో ఇతడును, ఇతనిలో క్రీస్తును నివశించుచున్నారు (యోహా 15 : 1-10) ఇతడు పరిశుద్ధాత్మచే




**5. దేవుని ఆలయము**

**THE TEMPLE OF GOD**

నింపబడి,పరిశుద్ధాత్మ బాప్తిస్మము నొందినందున, శరీరాశలన్నింటిని జయించి, పాతపురుషుని ప్రభావమును హతమార్చెను.



పరిశుద్ధాత్మ శక్తిద్వారా అతడు ఆత్మీయ జీవితము జీవించ గలుగుచున్నాడు. శరీరేచ్ఛలకు ఇక అతడు లోను కాజాలడు. అతడు చూచునది వినునది, తలంచునది మరి ఏదైనను విశ్వాస సంబంధమైనదైయుండి, లోకముపై జయము పొందియుండును. అతడు ఒకే ఒక నిశ్చయమైన, నిరీక్షణ కలిగి, రక్షకుడైన యేసుయొక్క రెండవ రాకడకొరకు సిద్ధముగా ఉండును. నిరంతరము నడిపించు దైవప్రేమలో అతడు నిలకడగా జీవించును.

"హృదయశుద్ధి గలవారు ధన్యులు వారు దేవుని చూచెదరు" (మత్తయి 6:8) సర్వసంపదలు కలిగి, శక్తిగల సామ్రాజ్యాన్ని పాలించిన దావీదు మహారాజు దేవుని ఎదుట దీనుడై "దేవా! నాయందు శుద్ధహృదయము కలుగజేయుము. నా యంతరంగములో స్థిరమైన మనస్సును నూతనముగా పుట్టించుము" (కీర్తన 51 : 10) అని ప్రార్థించెను. ఎవడును తనంతతాను తన హృదయాన్ని శుద్ధిచేసుకొనజాలడు లేక ఒక నూతన హృదయాన్ని సృష్టించుకొనలేడు. దావీదు రాజువలె విరిగి నలిగిన హృదయముతో, పశ్చాత్తాపముతో దేవుని సమీపించిన హృదయముమాత్రమే శుద్ధీకరించబడును. నూతన పర్చబడును. దేవుడు నీకొరకొక నూతన కార్యమును చేయుటకు ఆశించుచున్నాడు. నీస్వనీతి అనబడే మురికి గుడ్డలమూట, నీ హృదయాన్ని ఎంతమాత్రం శుద్ధిచేయలేదు. వ్యర్థమైన జపతపములద్వారా పాపహృదయము పవిత్రపరచబడదు. పరిశుద్ధ దేవుడే నీకు సహాయముచేయువాడు ఆయన

ఈలాగు వాగ్దానము చేయుచున్నాడు. "మీ అపవిత్రత యావత్తు పోవునట్లు నేను మీ మీద శుద్ధజలము చల్లుదును. మీ విగ్రహములవలన మీకు కలిగిన అపవిత్రత అంతయు తీసి వేసెదను నూతన హృదయము మీకిచ్చెదను. నూతన స్వభావము మీకు కలుగజేసెదను. రాతిగుండె మీలో నుండి తీసివేసి మాంసపుగుండెను మీకిచ్చెదను" (యెహెజ్కేలు 36:25-27) ఈ వాగ్దానము క్రొత్తనిబంధన కాలంలో క్రీస్తుప్రభుని రక్తప్రోక్షణద్వారా దేవుడు నెరవేర్చియుండెను

ఈ పటమునందు దేవదూతయొక్క ప్రత్యక్షత తిరిగి కన్పించుచున్నది. నిత్యజీవంలో ప్రవేశింపగోరువారికి పరిచారము చేయుటకు సహాయపడుటకు దేవదూతలు నియమించబడుదురు. "యెహోవాయందు భయభక్తులుగల వారిచుట్టూ ఆయన దూతలు కావలియుండి వారిని రక్షించును" (కీర్తన 34.7) కీరన 91:11, దాని 6:22; మత్త 2.13; 13:19 18 : 10; అ.కార్య 15 : 19; 12.7-10 వచనములు కూడా చదువుము.

సాతానుకూడా ఈ పటములో ఒకవైపున హృదయమునకు దగ్గరగా ఉన్నట్లు చూచుచున్నాము. అతడు తాను ఇదివరలో విడిచిపోయిన స్థానములో మరలా ప్రవేశించుటకు తగిన తరుణము వచ్చునేమోయని కనిపెట్టుచున్నాడు. కనుకనే మనము మెలకువగా నుండి ప్రార్థించవలసియున్నది "మనకు విరోధియైన సాతాను గర్జించు సింహమువలె ఎవరిని మ్రింగు



దునా అని తిరుగుచున్నాడు" 1 పేతు 5:8) తరుచుగా సాతాను వెలుగుదూత వేషమును ధరించి, అజాగ్రత్తగా ఉన్న పరిశుద్ధులకు లోకసంబంధమైన ఆశలను ఎరగాచూపి ఏలాగైనేనేమి వారిని తనకు బానిసలుగా చేసుకొనుచుండును. కనుక మనము "సాతానును వాని క్రియలను ఎదిరించవలెను. అప్పుడు వాడు మనయొద్దనుండి పారిపోవును" (యాకోబు4:7)

## ఆరవ పటము

## THE SIXTH PICTURE

పరిశుద్ధ జీవితమును అనుభవించి మరలా వెనుకకు తిరిగిన మనుజుని హృదయస్థితిని ఈ పటము తెలుపుచున్నది. ఇతని కన్నొకటి మూతపడుచున్నట్లుగా ఉన్నది. ఇతడు తన ప్రార్థనాజీవితంలో చల్లబడి, కుసిపాట్లు పడుచున్న క్రైస్తవ జీవితం జీవించుచున్నాడు. రెండవకన్ను సిగ్గుమాలినదై అటూ ఇటూ చూచుచున్నది, అది లోకాశలకొరకు వెదకుచున్నది. ఇదివరలో అతని హృదయములో ఉన్న వెలుగు తొలగి క్రమముగా అంధకారము ఆవరించుచున్నది క్రీస్తుకొరకు నిందలు శ్రమలు భరించుటకు, ఆయనయందు నమ్మకంగా జీవించుటకు తగిన మనస్సు లేకపోయినందుననే ఈ అంధకారమితని హృదయమును ఆవరించుచున్నది. ఇతడు అనేక శోధనలచేత శోధించబడుచూ, వానిని ఎదిరించుటకును, జయించుటకును బదులు ఆయా శోధనలకు లొంగిపోవుట జరుగుచున్నది.

ఇతడు దేవుని స్వరమును వినుటకు బదులు శోధకుని కల్లబొల్లి మాటలు విని, వానిని అంగీకరించుచున్నాడు.



## 6. శోధించబడి, విభజించబడిన హృదయము
## THE TEMPTED AND DIVIDED HEART

అతడు ఇంకా క్రైస్తవునివలె నటించుచూ, చర్చికి వెళ్ళుచూ ఉన్ననూ, అతడు మతం అనే ముసుగులో ఎన్నో లౌకికాశలు



దాచుకొని ఉన్నాడు. దేవునియెడల గల ప్రేమ అతనిలో
సన్నగిల్లిపోయినది. అతడు ద్విమనస్కుడై రెండు నావలపై
చెరియొక కాలును వేసి పయనించుచున్న బుద్ధిహీనునివలె
ఉన్నాడు అతడు దేవుని ప్రేమించుచున్నట్లే నటించి, లోకా
శలతో సరసము లాడుచున్నాడు అతని హృదయంలో ఉన్న
మనస్సాక్షి. అనబడే నక్షత్రము కూడా కాంతి విహీనమైనట్లు
మనము చూచుచున్నాము సిలువను సంతోషంగా మోయ
డానికి ఇతనికిప్పుడు ఇచ్ఛలేదు. సిలువ వీనికి ఎంతో భారము
గాను, అనంగీకరముగాను తోచుచున్నది. అస్థిరమైన విశ్వాస
ముతో అనుమానాస్పదమైన ప్రార్థనలు చేయుచూ, తనహృద
యమునుగూర్చి అశ్రద్ధచేయువాడై యున్నాడు నెమ్మదిగా తన
హృదయంలో శోధకునికి చోటిచ్చి, అనేక శోధనలకు లొంగి
పోయిన స్థితిలో ఉన్నాడు. దేవునియందు విశ్వసించిన వారి సహ
వాసమును మానివేసి, లౌక్యముతో నిండిన వారితో సంతో
షింప దొడగినాడు.

గర్వమునకు సాదృశ్యమైన నెమలియొక్క ప్రభావము,
మరలా ఈ హృదయంలో ప్రవేశించినది. కృపద్వారా అతడు
రక్షించబడిన సంగతి మరచి, గర్వముతో నిండిన క్రైస్తవ
జీవితం జీవించుట కారంభించెను. త్రాగుడు అనే అలవాటు
ఇతని హృదయాన్ని తట్టి, అందు ప్రవేశించుటకు ప్రయత్నం
చేయుచున్నది. నెమ్మది నెమ్మదిగా చెడ్డస్నేహితులతో కలసి,
సిగ్గుమాలినతనంతో వారి క్రియలలో ఏకీభవించ ప్రారంభిం
చెను. ఏదో స్నేహితులతో, సంతోషంగా ఒక్కసారి త్రాగి
నంతలో అది ఆత్మీయ జీవితమునకు పెద్ద నష్టము కలిగించ

దులే! అని సాతాను అతనిని నెమ్మదిగా ప్రోత్సహించును. చిన్న చిన్న బలహీనతలవల్ల అంతగా నష్టములేదని, తృప్తి చెందును. అపవిత్రమైన మాటలు, పరిహాసములు, అసభ్యకరమైన బొమ్మలను చూచి, సంతోషించుట, అపహాసకుల సహవాసము, నాట్యశాలలకు వెళ్ళి ఆనందించుట మొదలైన కార్యములన్నీ అంత ప్రమాదకరమైనవి కావనియు, అసలు అవి పాపములే కావనియు, సాతానుడు బోధించి ఇట్టి లౌకిక కార్యములు చేయుటకు పురికొల్పును. అపవిత్రమైనట్టి అనేక తలంపులు ఆకాశపక్షులవలె మన తలపైనుండి ఎగిరిపోవుచుండవచ్చును. అయితే అట్టి చెడ్డ తలంపులకు మన హృదయంలో ఏ మాత్రము చోటిచ్చినను, అవి అచ్చట గూళ్ళుకట్టుకొని స్థిరనివాసము లేర్పరచుకొనును ఇక వాని దుష్టకార్యములకు మితియుండదు. మనము సాతానుకు చిటికెన వ్రేలు అందించిన అది చేతినే స్వాధీనపరచుకొని, చివరకు సర్వశరీరమును వశపరచుకొని, మన ఆత్మను నిత్యనరకమునకు పాలుచేయును. యౌవనేచ్ఛలను విసర్జించి పాపమునకు దూరముగా పారిపొమ్మని దైవజనుడైన సొలొమోను హెచ్చరించుచున్నాడు. విమోచకుడును, జయశీలుడైన యేసు చెంతకు చేరిననాడు మనకు భయముండదు. ఈ పటములో ఒక మనుష్యుడు ఒక పదునైన బాకుతో హృదయమును పొడుచుచున్నట్లు చూచుచున్నాము. ఇతడు క్రైస్తవ్యమును, నిందించిహింసించువారికి గుర్తుగా ఉన్నాడు. అట్టి వాడులు వేసే నాలుకలు పరిహసించే పెదవులు కలిగినవారై కొందరు క్రీస్తుబిడ్డలను, దూషించి



వారి హృదయములను గాయపరచుదురు. వారు ప్రభువుని నమ్మినవారి హృదయములో గందరగోళమును రేకెత్తించి వారిని హింసింతురు అట్టి స్థితిలో శోధనలకు చోటిచ్చిన హృదయముగల క్రైస్తవుడు, తన్ను నిందించే ప్రజలకు జడిసిపోయి, దేవుని కంటె మనుష్యుల మెప్పునే కోరుచుండును. మానవులకే దాసుడైపోయి, దేవునికి దూరమగును. కష్టములు, కలతలు వచ్చినప్పుడు, వారు మరీ నిస్పృహ చెందినవారై ఆదరణకర్తయైన దేవుని సమీపించుటకు బదులు, లోకమువైపునకే తరలిపోవుదురు ద్వేషము అసూయలకు గుర్తు అగు పాము మరలా ప్రత్యక్షమై, నీతి నిజాయితీగా బ్రతుకుచున్న అతని జీవితమును, పతనము చేయుటకు పొంచియున్నది. స్థలందొరికితే ఆ హృదయాన్ని అసూయతోను, గర్వంతోను నింపుటకు చూచుచున్నది

ఇక ధనాపేక్ష మన హృదయంలో ప్రవేశించుటకు ఎంతోసేపు పట్టదు. యేసుప్రభు నొకవేళ "మీరు శోధనలో ప్రవేశింపకుండునట్లు మెలకువగా ఉండి ప్రార్థించుడి" (మత్తయి 26 : 41) అని చెప్పుచున్నను మనము శోధనలకు లొంగిపోవుచుండుట విచారకరమే "తాను నిలుచున్నానని తలంచుకొనువాడు పడకుండునట్లు జాగ్రత్తగా చూచుకొనవలెను" (1 కొరింథి 10 : 12) "మీరు అపవాది తంత్రములను ఎదిరించుటకు శక్తిమంతులగునట్లు దేవుడిచ్చు సర్వాంగ కవచమును ధరించుకొనుడి" (ఎఫెసీ 6 : 11-18 చదువుము).

---

# ఏడవ పటము

## THE SEVENTH PICTURE

కఠినపర్చబడి క్రైస్తవ జీవితంలో వెనుకంజవేసిన మానవ హృదయస్థితికి ఈ పటము సాదృశ్యమైయున్నది. ఒకసారి వెలిగించబడి పరలోక సంబంధమైన వరములను రుచి చూచి, పరిశుద్ధాత్మానందములో పాలివాడై, మరలా వెనుకటి అపవిత్ర జీవితమునకు దిగజారిన మనుజుని హృదయస్థితి ఈ పటములోని హృదయమువలె నుండును. అంతేగాక ఈ హృదయము బహుగా కఠినపర్చబడి, ఇక ఎన్నటికి పశ్చాత్తాపము లేనిదై దైవసాన్నిధ్యాన్ని కోరనిదై యుండును. దేవుని యొక్క సువార్త ఇతనికి బహుగా ప్రకటించబడినను, ఇక ఆ హృదయము ఏమాత్రము మెత్తబడుటకు అవకాశము లేనట్లుండును ఈ విధముగా కఠినపర్చబడిన బండరాయివంటి హృదయము, దేవునియొక్క జాలిగల ఆహ్వానమునకు లోబడక, అంతకంతకు చెడిపోవుచూ, వ్యర్థమైన జీవితంలోనికి జారిపోవును.

ఆత్మీయముగా వెనుకంజవేసిన వ్యక్తిని గూర్చి యేసు ప్రభు వీలాగు చెప్పుచున్నాడు "అపవిత్రాత్మ ఒక మనుష్యుని వదలిపోయిన తర్వాత అది విశ్రాంతి వెదకుచూ నీరులేనిచోట్ల తిరుగుచుండును. విశ్రాంతి దొరకనందున నేను విడిచివచ్చిన నాయింటికి తిరిగి వెళ్ళుదుననుకొని, వచ్చి ఆ ఇల్లు ఊడ్చి అమర్చి ఉండుట చూచి, వెళ్ళి తనకంటె చెడ్డవైన మరి ఏడు



(అపవిత్ర) ఆత్మలను వెంటబెట్టుకొని వచ్చును. అవి అందులో ప్రవేశించి అక్కడనే కాపురముండును. అందుచేత ఆ మనుష్యుని కడపటిస్థితి మొదటిదానికంటె చెడ్డదగునని చెప్పెను. (లూకా 11 : 24-26) "కుక్క తన వాంతికి తిరిగినట్లును, కడుగబడిన పంది బురదలో దొర్లుటకు మళ్ళినట్లును, అను నిజమైన సామెత చొప్పున వీరికి సంభవించెను" (2 పేతురు 2.22).

ఈ వచనములు వెనుదిరిగి దిగజారిన పాపియొక్క హృదయ లక్షణములను తేటగా వివరించుచున్నవి పాపమును దాని మోసకరమైన కార్యములును మానవ హృదయాన్ని పాలించుటకు ఆ హృదయంలో స్థావరము ఏర్పరచుకొనును. అట్టివాని హృదయస్థితిని అతని ముఖవర్చస్సు తెలుపుచునే యుండును పాపమును, పరిశుద్ధాత్మయు కలసి ఎంతమాత్రము నివసింపజాలవు గనుక, పరిశుద్ధాత్మ పావురము, ఈ హృదయమును విడిచిపోవుచున్నది. ఒక హృదయము, దేవునికి మందిరముగాను, సాతానుకు గుహగాను ఒకే సమయంలో ఉండ వీలుపడదు. ఒకవేళ తప్పిపోయిన కుమారునివలె ఈహృదయము, దేవునివైపునకు మళ్ళునేమో అని, దేవదూత విచారముతో వెనుదిరిగి చూచుచున్నది. "వాడు పందులు తిను పొట్టుతో తన కడుపు నింపుకొన ఆశపడెను. గాని ఎవడును వానికేమియు యియ్యలేదు." అట్టిస్థితిలో అతడు బుద్ధి తెచ్చుకొని తన తండ్రియొద్దకు తిరిగి వెళ్ళి "తండ్రీ నేను పరలోకమునకు విరోధముగాను నీ ఎదుటను పాపముచేసితిని ఇక మీదట నీ కుమారుడనని పించుకొనుటకు యోగ్యుడను కాను"

(లూకా 15 : 18) అని మొర్రపెట్టను తండ్రి అతని మనవి ఆలకించి, అతనిని క్షమించి తన ప్రేమగల కౌగిలిలో చేర్చుకొనెను.

ఈ పటమునందలి హృదయముయొక్క స్థితిని గమనించిన, నిజమైన పశ్చాత్తాపము, దేవునివైపు తిరిగే మనస్సు, యేసుప్రభుని పాదములయొద్ద క్షమాపణ వేడుకునే తలంపు ఎంతమాత్రము కనిపించదు ఇతని మానసాక్షి ఎఱ్ఱగా కాలిన ఇనుప ఊచతో వాతివేయబడినట్లు ఉన్నది. అది కదలక మెదలక ఉన్నది. అతనికి కన్నులున్నవిగాని, అతనికొరకు తన పాదములక్రిందనే కాచుకొనియున్న మహా అఘాధమైన నరకము అతడు చూడలేకపోవుచున్నాడు. అతనికి చెవులున్నవిగాని యేసురక్షకుని ప్రేమగల స్వరమును వినలేని స్థితిలో ఉన్నాడు. తన పాపకార్యముల విషయమై ఎంతమాత్రము సిగ్గుపడేవాడుగా ఇతడు లేడు. ఇతని హృదయపీఠముమీద సాతానుడు కూర్చొని పరిపాలన సాగించుచున్నాడు. అతడు పైకి భక్తియు, మతనిష్ఠయు గల వానివలె నటించునేగాని అతని జీవితము సున్నము పూసిన సమాధివలె ఉన్నది "లోపల చనిపోయినవాని ఎముకలు అన్నివిధములైన, అపవిత్రతతో నిండియున్నది" (మత్త 23 : 27).

సత్యస్వరూపియగు ఆత్మస్థానమును అసత్యములకు జనకుడైన సాతాను, ఆక్రమించుకొని యున్నాడు ప్రతీ పాపము, ప్రతీ జంతువు వాటికిచెందిన ప్రత్యేక దయ్యములతోను,



దురాత్మలతోను ఐక్యమై ఈ హృదయమునందు స్థిరనివాస మేర్పరచుకొని యున్నవి. ఒకవేళ, వాని బాధలనుండి ఇతడు




7. వెనుకంజవేసిన లేక కఠినపర్చబడిన హృదయము

THE BACKSLIDDEN OR HARDENED HEART

తప్పించుకొనవలెనని తలంచినను అవి ఇతనిని బంధించి ఇక కదలకుండాచేయును. "ఎవడైనను మోషే ధర్మశాస్త్రమును

నిరాకరించిన యెడల ఇద్దరు ముగ్గురు సాక్షుల మాటమీద కనికరింపకుండా వానిని చంపించుదురు. ఇట్లుండగా దేవుని కుమారుని పాదములతో త్రొక్కి తాను పరిశుద్ధపరచబడుటకు సాధనమైన నిబంధన రక్తమును అపవిత్రమైనదిగా ఎంచి కృపకు మూలమగు ఆత్మను తిరస్కరించిన వాడు ఎంత తక్కువైన దండనకు పాత్రుడుగా ఎంచబడునని మీకు తోచును. ( హెబ్రీ 10 : 23-29; 2 పేతురు 1-14 చదువుడు )

ప్రియస్నేహితుడా ! ఈ హృదయ పటముయొక్క స్థితి, నీ హృదయస్థితిని పోలియున్నచో తక్షణమే దేవుని సన్నిధిలో మొరపెట్టుము. నీ పూర్ణహృదయముతో దేవుని సన్నిధిలో ప్రలాపించుము. ఆయన "అదోకస్థితిలో అణగిపోయిన వానిని సహా రక్షించగలడు" నీవు నిజమైన పశ్చాత్తాపముతో ఆయనను సమీపించినచో నీ అపరాధములన్నింటిని ఆయన క్షమించును దయ్యమును అంధకార శక్తులను నీ హృదయమునుండి పారద్రోలగలవాడు ఆ ప్రభువుమాత్రమే నీవు నీహృదయమును తెరచి, ఆయనను చేర్చుకుంటే, పూర్ణమైన పశ్చాత్తాపమును నీవు పొందియుంటే, దేవుడు నిన్ను విడిపించును. ఒకప్పుడు కుష్ఠురోగి యేసుప్రభువు సన్నిధికి వచ్చి, ఆయన ఎదుట మోకాళ్ళూని నీకిష్టమైతే నన్ను శుద్ధునిగా చేయగలవని ఆయనతో చెప్పి ఆయనను వేడుకొనగా, ఆయన కనికరపడి చెయ్యిచాపి వానిని ముట్టి నాకిష్టమే నీవు శుద్ధుడవుకమ్మని వానితో చెప్పెను, ( మార్కు 1 : 40-41 ) ఇదేవిధముగా నీవు ప్రభుని సమీపించిన నీ కఠినహృదయమును ఆయన



సరిచేయును. నీవు ఇంకనూ నీ హృదయము కఠినపరచుకొనుచూ, చీకటినే ప్రేమించుచూ, వెలుగును త్రోసివేసిన యెడల, నీకిక నిరీక్షణ ఉండదు. ఎవ్వరూ నీకు సహాయపడరు. ఎందుకనగా నీవు జీవమును వెదకుటమాని మరణమునే వెదకుచుంటివి. "పాపమునకు జీతము మరణము" ( రోమా 6.23 ).

---

# ఎనిమిదవ పటము

## THE EIGHTH PICTURE

ఈ పటములో కఠినపర్చబడిన పాపహృదయము, భయంకర మరణమును ఎదుర్కొన్న విధమును చూచుచున్నాము. ఇతని శరీరములో తీవ్రమైన బాధయు, హృదయములో మరణభయమును గలదు. మరణము (అస్థిపంజరము) అతడు అనుకొనని ఘడియలో ఆసన్నమైనది. మోసకరమైన పాపభోగములు మాయమయ్యెను. పాపమునకు జీతమైన భయంకరమగు జీతము అనబడు మరణము అతనిని, తీవ్రముగా ఎదుర్కొనెను. బహు భయంకరమైన బాధకరమైన మరణపాశములతని చుట్టుకొని యుండెను. అట్టిస్థితిలో అతడు ప్రార్థించినను, అతని మొర దేవుని సన్నిధిచేరని పరిస్థితిలో ఉన్నది. అతని సన్నిహితులైన స్నేహితులెవ్వరూ అతనివద్ద

నిలబడుటకు భయపడుచున్నారు. వారు చెప్పే ఓదార్పు మాటలవల్ల ఇప్పుడు అతని కెంతమాత్రము ఉపశాంతి కలుగలేదు. అతడు సంపాదించుకున్న అశాశ్వతమైన ఐశ్వర్యము కూడా అతని జీవితకాలమును పొడిగించలేకపోయినది. అంతేగాక అతని ధనము అతని ఆత్మరక్షణకు ఎంతమాత్రము సహాయపడలేకపోయెను. అతని ఆత్మలోని భయంకర బాధనుకూడా ఆ ధనము తొలగించజాలదయ్యెను. సాతాను ఇతనికి దైవ చింతన లేకుండా చేసినందున దేవుని సన్నిధిని గుర్తుచేసుకొనుటకైనా అవకాశమివ్వనందున ఇక అతడు ఎంతమాత్రమును దేవునిపై తనగురిని నిలుపలేడు.

ఒకప్పుడు తానెంతగానో ప్రేమించిన ప్రతీపాపకార్యము ఇప్పుడతనిని, పరిహాసము చేయునదిగా ఉండెను. అతడు దేవుని కృపను జారవిడుచుకొని, నేరస్థుడై శిక్షకు గురియయ్యెను. "జీవముగల దేవుని చేతిలో పడుట భయంకరము" (హెబ్రీ 10:31) అని ఇప్పుడు బాధపడసాగెను. బాగుగా ఉన్నపుడతడు, ఏదో అనుకూల సమయంలో దేవుని హత్తుకొని ఆయనతో ఏకీభవించవచ్చునులే అని నిర్లక్ష్యముచేసెను. కాని, ఇప్పుడతనికి సమయములేకుండెను. ముసలివాడవై ఇక చనిపోయేస్థితిలో దేవునిని వెంబడించవచ్చునులే అని ఆనాడు తలంచెను. కాని అతడు రక్షణను జారవిడుచుకొనెను వేలాది ప్రజలు దేవుని వెదకకుండగనే, రక్షించబడకుండగానే మరణించుచున్నారు. రక్షించబడుటకు దేవుడు వారిని ప్రేరేపించి





8. పాపియొక్క అంతిమస్థితి

THE SINNERS DOOM

నపుడు వాయిదాలువేసి చివరకు నరకపాత్రులగుచున్నారు. కనుక సమయముండగానే, దేవుడు మనకుదొరుకు కాలముననే, ఆయన సమీపమున ఉండగానే, మన మాయనను మన హృదయములో చేర్చుకొనుట మేలు. ఈపటము లోని చావుకు సిద్ధమైన పాపి దేవుని కృపను, ఆయన ఆదరణకరమైన వాగ్దానములను నిర్లక్ష్యము చేసినందుననే భయంకర మరణము నొందెను. అతనికి న్యాయాధిపతియొక్క స్వరము (ఇతడు తిరస్కరించిన రక్షకుడు) ఈ విధముగా వినబడుచున్నది "నన్ను విడచి, అపవాదికిని వాని దూతలకును సిద్ధపరచబడిన నిత్యాగ్నిలోకి పోవుడి" ( మత్తయి 25:41 ) "మనుష్యులొక్కసారే మృతిపొందవలెనని నియమించబడెను. ఆతరువాత తీర్పు జరుగును." ( హెబ్రీ 9 : 27 )





# తొమ్మిదవ పటము

## THE NINTH PICTURE

ఈచిత్రము సమస్తశోధనలను, భయంకరమైనబాధలను సహించి, వాటినుండి సంపూర్ణ జయమునొందిన హృదయమునకు సాదృశ్యముగా నున్నది. ఇతడు అనేక విధములుగా శోధించబడినప్పటికిని, ఏవిషయములోను సాతానుకు లొంగక, అంత్యమువరకు సహించుచూ, తనకు జయమునను గ్రహించగల యేసుక్రీస్తు ప్రభువుద్వారా సంపూర్ణజయమును పొందియుండెను. ఇతడు తన క్రైస్తవ పరుగు పందెమును బహు జాగ్రత్తతో నిర్వహించినవాడై యుండెను. అతడు కుడి ఎడమలకు తొట్రిల్లక గురిగల క్రైస్తవ జీవితమును జీవించెను. "విశ్వాసమునకు కర్తయు దాని కొనసాగించువాడునైన యేసు వైపు చూచుచూ తన ఎదుట ఉంచబడిన పందెములో ఓపికతో పరుగెత్తెను. రాబోవు ఆనందం ప్రభువుద్వారా పొందుటకు నిందలు, అవమానములు నిర్లక్ష్యముచేసి, నమ్మకముగా సిలువను సహించెను" ( హెబ్రీ 12 : 1-2 ) ఈ విశ్వాస హృదయాన్ని ఏవిధంచేతనైనా భ్రష్టత్వంవైపుకు మళ్ళించాలని సాతాను అనేకవిధములప్రయత్నించెను అయితే ఇతడు దేవుని బిడ్డగా యుండెను గాన సాతానుయొక్క ప్రయత్నములన్నియు భగ్నములయ్యెను. గర్వము ధనాపేక్ష, అవినీతిదయ్యము, మొదలైనవి ఈ హృదయముచుట్టూ ఆవరించి, సమయము కొరకు వేచియున్నవి. గాని ఇతడు మెళకువ గలిగిన క్రీస్తుబిడ్డ

గాన ఆ యా శోధనలకు లొంగక వాటిని త్రోసిపుచ్చెను. చిరుతపులికి బదులు, ఈ పటములో ఒక గాడిదను చూచుచున్నాము. పాపము పరిస్థితులను బట్టి అనేక పరిణామములు చెంది, వివిధ వేషములతో, వివిధ నామములతో మనకు ప్రత్యక్షమగుచుండును. ఒకప్పుడు పాపపుశోధన మేకచర్మము కప్పియున్న తోడేలువలె మనలను ఎదుర్కొనును పైకి అది ప్రమాదకరమైనదిగా కనిపించనందున, దానికి సులువుగా కొందరు లోబడుటయు, పిదప దానిచే పట్టబడుటయు జరుగుచున్నది. మెలకువగల క్రైస్తవుడు సాతానుయొక్క మోసపు కార్యములలో ఎంతమాత్రము, చిక్కుకొనడు. సాతాను మతమనే వేషము ధరించియు, లేక వెలుగు దూతవేషము ధరించియు అనేక విధములుగా ఈ హృదయమును శోధించినను, ఇతడు క్రీస్తునందు, ఆయన వాక్యమునందు నిలకడైన జీవితము జీవించియుండెను. దేవుని వాక్యమును, ఇతనియందు గల సత్యస్వరూపియగు ఆత్మయు ఇతనిని, నిజమైన మార్గములోనే నడిపించుచుండెను. ఈ పటములో ఒక మనుష్యుడు ఒకచేతితో మద్యముతో నిండిన గ్లాసును పట్టుకొని, ఈ సత్క్రైస్తవునిచుట్టూ చిందులు త్రొక్కుచూ, తూలుచూ, తిరుగుచున్నట్లు చూతుము. ఇతడీ హృదయమునకు లోకాశలను చూపి, అందలి ఆనందములచే వీనిని వశపర్చుకొన ప్రయత్నించుచున్నాడు. అయినను ఈ క్రీస్తుబిడ్డ క్రీస్తుతో కూడా సిలువవేయబడి, లోకము విషయములోను, లోక పాపభోగముల విషయములోను చనిపోయినందున, ఇతడెంత



మాత్రమును, లౌకిక ఆశలవైపు తన గురిని నిలుపకయుండెను. ఇతనికి దైవచింతన తప్ప లోకతలంపులే లేకుండెను ఇతని ఆత్మ ప్రభువునందు బహుస్థిరమైనదిగా, నిలకడైనదిగా యుండెను. మరొక మనుష్యుడు ఒక బాకు (కత్తి)ను చేతబూని, ఈ హృదయమును గాయపర్చుచున్నట్లు చూచుచున్నాము. ఇతనిపై చెడ్డమాటలు చెప్పుచూ, చాటున హానికలిగించుచూ, హింసించుచూ, నిందించుచూ, ఏ విధముచేతనైనను వీని విశ్వాసమును బలహీనపర్చవలెనని, ప్రయత్నించుచుండెను కొందరు ఎదుటివాని మంచిని చూచి ఓర్వలేనివారై, అతనిపై ఏవో నిందలు మోపుచూ, అబద్ధములతో కూడిన చెడ్డమాటలు కల్పించుచుందురు. ఇచ్చట క్రైస్తవుడు, ఇట్టివాటిని ఎంతమాత్రము లెక్కచేయువాడు కాదు. ఇతనికి మనుష్యులేమి చెప్పుకొనుచున్నారనే తలంపు లేదు. గాని దేవుడు తన విషయం ఏమి చెప్పుచున్నాడు? దేవుని దృష్టిలో నేను మంచిగా ఉండగలిగినే చాలు. అనే దృఢమైన మనస్సు కలిగి యుండెను. లోకులు చెప్పుకునే మాటలతని చెవిలోనికి రానివ్వక, దేవుని కొరకే అతడు కనిపెట్టుకొనువాడుగా నుండెను. లోకులు తనపై దాడిజరుపు సమయములో అతడు యేసుప్రభువు చెప్పిన మాటలను గుర్తుచేసుకొని ఆనందించు చుండును" నా నిమిత్తము జనులు మిమ్మును నిందించి హింసించి, మీమీద అబద్ధముగా చెడ్డమాటలెల్ల పలుకునపుడు మీరు ధన్యులు. సంతోషించి ఆనందించుడి, పరలోకమందు మీ ఫలము అధికమగును" (మత్తయి 5 : 11-12).

పాపము, శరీరేచ్ఛ, స్వార్థం, సాతాను ఇవన్నియు మంచి క్రైస్తవుని దేవుని దివ్యమైన ప్రేమనుండి వేరుచేయవలెనని, సర్వవిధములా ప్రయత్నించుచుండును. అయితే అతడు వాని శోధనలకు చెదరక, బెదరక "క్రీస్తుప్రేమనుండి మనలను ఎడబాపువాడెవడు ? శ్రమయైనను బాధయైనను హింసయైనను కరువైనను, వస్త్రహీనతయైనను, ఉపద్రవమైనను, ఖడ్గమైనను మనలను ఎడబాపునా ?" (రోమా 8:35) అనువచనము తలంచుకొని, దేవుని సన్నిధిలో బహు ధైర్యముగా విశ్వాసంతో సమస్త అంధకార కార్యములను ఎదిరించును. దేవుని ప్రేమలో, కృపలో అతడు వేరుపారినవాడై, ఫలించును. "మనలను ప్రేమించిన వానిద్వారా మనము వీటన్నిటిలో అత్యధిక విజయము పొందుచున్నాము" అని పౌలు భక్తుడు చెప్పినప్రకారం ( హెబ్రీ 8 : 37 ) దేవుని ప్రేమయు, కృపయు అన్నిశోధనలను జయించుటకు, ఇతనికి అండగా నున్నవి. ఇతడు అపవాది యొక్క తంత్రములను ఎదిరించుటకు కావలసిన శక్తికొరకు దేవుడిచ్చు సర్వాంగ కవచమును ధరించియుండెను (నడుముకు సత్యమను దట్టి కట్టుకొని, నీతియను మైమరుపు తొడుగుకొని, పాదములకు సమాధాన సువార్తవలననైన సిద్ధమనస్సను జోడు, విశ్వాసమను డాలు, రక్షణయను శిరస్త్రాణము, దేవుని వాక్యమను ఆత్మఖడ్గము, అనునవి ధరించుటయే సర్వాంగ కవచము) ఈ సర్వాంగ కవచమును ధరించి సమస్త శోధనలను జయించిన యేసుక్రీస్తు ప్రభువునందలి విస్వాసముద్వారా, సాతాను



యొక్కయు, దురాత్మల సమూహములయొక్క తంత్రములను జయించగలము. అంతేగాక, మనము ఈ విధముగా శోధ




9. జయజీవితానుభవముగల హృదయము

THE CONQUERING HEART

నలు జయించినవారమై, నిత్యజీవ కిరీటమును పొందుదుము.

ఇతని హృదయమునందలి నక్షత్రము బహు తేటగాను ప్రకాశమానముగాను ఉన్నది. ఈ హృదయము పరిపూర్ణమైన విశ్వాసముతోను, పరిశుద్ధాత్మతోను, సంపూర్ణముగా నిండియున్నది. దేవదూత, ప్రతీక్షణములోను దైవవాక్యమును ఈ హృదయమునకు బోధించుచు, ప్రశస్తమైన దేవుని వాగ్దానములను గుర్తుచేయుచూ, సమస్తశోధనలయందును జయమును చేకూర్చుచున్నది. మరియు అంతమువరకు నిలకడగా మెలకువగా ఉండునట్లు ఈ హృదయమును ఆయత్తపరచుచున్నది.

## నమ్మకమైనట్టియు, జయ జీవితానుభవముగల హృదయమున కివ్వబడిన కొన్ని వాగ్దానము లివి.

"జయించువానికి దేవుని పరదైసులో ఉన్న జీవవృక్ష ఫలములు భుజింపనిత్తును."

"జయించువాడు రెండవ మరణమువలన ఏ హానియు చెందడు."

"జయించువానికి మరుగైయున్న మన్నాను భుజింపనిత్తును. మరియు అతనికి తెల్లని రాతినిత్తును. ఆ రాతిమీద చెక్కబడిన యొక క్రొత్తపేరుండును పొందినవానికే గాని అది మరిఎవనికిని తెలియదు"

"నేను నాతండ్రివలన అధికారము పొందినట్టు జయించుచు; అంతమువరకు నాక్రియలు జాగ్రత్తగా చేయువానికి జనులమీద అధికారము ఇచ్చెదను. మరియు ఇతనికి వేకువ చుక్క ఇచ్చెదను."



"జయించువాడు ఆలాగున తెల్లని వస్త్రములు ధరించుకొనును, జీవగ్రంథములోనుండి అతని పేరెంతమాత్రమును తుడుపుపెట్టక నాతండ్రి ఎదుటను ఆయన దూతల ఎదుటను అతని పేరు ఒప్పుకొందును."

"జయించువానిని నా దేవుని ఆలయములో ఒక స్తంభముగా చేసెదను. అందులోనుండి వాడు ఇకమీదట ఎన్నటికిని వెలుపలికిపోడు. మరియు నా దేవుని పేరును, పరలోకములో నా దేవునియొద్దనుండి దిగివచ్చుచున్న నూతనమైన యెరూషలేమను నా దేవుని పట్టణపుపేరును, నాక్రొత్త పేరును వానిమీద వ్రాసెదను"

"నేను జయించి నా తండ్రితో కూడా, ఆయన సింహాసనమునందు కూర్చుండియున్న ప్రకారము జయించువానిని నాతోకూడా నా సింహాసనమునందు కూర్చుండనిచ్చెదను."

(ప్రకటన 2 : 7,11,17,26; 3 : 5,12,21)

తెరువబడిన డబ్బుపంచి కూడా ఒక సత్యమును బయలు పరచుచున్నది. ఇతడు తన హృదయమును మాత్రమే గాక, తన ధనమును కూడా దేవునికి అంకితం చేసియున్నాడు. తన ధనమును వ్యర్థమైన లౌకిక భోగములకొరకు ఎంతమాత్రము ఖర్చుచేయక, తన రాబడి అంతటిలో దశమభాగమును ప్రభువునకు సమర్పించుచూ, పేదవారిని వారి అక్కరలలో ఆదుకొనుచూ తన జీవితమును గడుపుచున్నాడు. ఇతని ఘనమును, ధనమును, సమస్తమును దేవునికి సమర్పించి,

తాను చేయు ప్రతీ కార్యమును దేవునికి మహిమ కలిగించు నట్టిదిగా ఉండునట్లు జీవించును.

కొట్టియు, చేపయు ఇతని జీవిత విధమును తెలుపుచున్నది. ఇతడు అతిపవిత్రమైనట్టియు, నమ్రతతో కూడి నట్టియు జీవితము జీవించుచుండెను. ఇతడు ఏ విధమైన అపవిత్ర ఆహారమును అనగా గొంతుపిసికి చంపినట్టియు, రక్తము కలిగినట్టియు పదార్థములను తినకయు, కల్లు, సారాయి మొదలగు మత్తుపానీయములు సేవించకయు, తన శరీరమును కాపాడుకొనుచుండెను. తన శరీరమే దేవునికి మందిరమని అతడు గుర్తించినవాడై, శరీర అలంకరణ నిమిత్తమై ధనమును ఎంతమాత్రమును దుర్వినియోగము చేయక, యుండెను. అనగా బహు విలువైన వస్త్రములను ఆశించక, తగుమాత్రము విలువగల వస్త్రములనే ధరించును. చుట్టలు, బీడీలు, సిగరెట్లు మొదలగు వ్యర్థమైనట్టియు, ఆహారము కానట్టి వాటిని ఎంతమాత్రము సేవించక, తన దేహమును భద్రపరచుకొనుచుండును. నల్లమందువంటి ఘోరమైన పదార్థముల జోలికి అతడుపోక, పరిశుభ్రమైన, శరీర పోషణకు, అనుకూలమైన, ఆహారమును మాత్రమే తీసుకొనును. తనహృదయమే దేవునికి మందిరం. ఇదియే ప్రార్థనామందిరముగా అతడు చేసుకొనును. వాతావరణ పరిస్థితులవల్లగాని, ఇతర పనులవల్లగాని, ఏలాంటి ఆటంకములు వచ్చినను, ఇతడు సంఘారాధనలకు సక్రమంగా వెళ్ళుచూ, తన ఆత్మను బలపరచుకొనుచుండును. ఇతడు ప్రార్థనాపరుడుగా అన్ని సమయములందును తన జీవితమును



గడుపును సంఘములోను, గృహములోను, ఏకాంతముగాను ఇతడు ప్రార్థించును ప్రార్థన యందలి ప్రాధానము ఇతడు బాగుగా ఎరిగినవాడై యుండెను. ప్రార్థనద్వారానే ప్రభువును సమీపించగలమనియు, దేవునితో ఐక్యత సహవాసము కలిగి యుండగలమనియు ఇతడు చక్కగా ఎరిగియుండెను. ఇట్లు ప్రార్థించుచూ ఇతడు దేవునితో ఎడతెగని సహవాసము కలిగి జయముతో కూడిన క్రైస్తవ జీవితము జీవించుచున్నాడు.

తెరువబడిన పుస్తకము బైబిలు గ్రంథమే. ఇతనికి బైబిలు మూయబడిన గ్రంథముగా ఉండక, తెరువబడిన గ్రంథముగా ఉండెను. ఇతడు అనుదినము పరిశుద్ధ గ్రంథ పఠనము చేయుచుండును. తద్వారా ఇతడు ఎడతెగని జ్ఞానమును బలమును పొందుచుండును. బైబిలే ఇతని పాదములకు వెలిగిచ్చు దీపమును, త్రోవలకు వెలుగునై యుండెను ఇందలి దివ్య వాక్యములే ఇతని జీవమార్గములు. ఇందలి వచనములే, ఇతని ఐశ్వర్యములును, భవిష్యత్తునై యుండెను శత్రువును జయించుటకు ఈ వాక్యమే వీనికి వెలుగుగాను ఆత్మఖడ్గముగాను ఉండెను వీని ఆత్మకు అనుదినాహారమీ పవిత్ర గ్రంథమే! ఆత్మీయ దాహమును తీర్చగలిగినట్టియు, తన్ను తాను శుద్ధిచేసుకొనుటకు కావలసినట్టియు పవిత్ర జీవజలము ఈ దివ్య వచనములే. తన్ను తాను చూచుకొనుచూ, జాగ్రత్తతో జీవించుటకు ఈ గ్రంథరాజమితనికి నిలువుటద్దమువలె తోడ్పడుచున్నది. ఈ విధముగా ఇతడు జీవగ్రంథమగు బైబిలును తన జీవితమునకుమార్గదర్శిగా ఉంచుకొని జీవించుచున్నాడు. అనేకుల

వలె ఇతడు బైబిలును ఏమూలనో, మూసి ఉంచే స్థితిలో లేడు. దివారాత్రములు ఈ దివ్యగ్రంథమును ధ్యానించుచుండును.

అంతేకాక ఇతడు సిలువను ప్రేమపూర్వకముగా ఇష్టపూర్వకముగా మోయుచూ, సిలువయందు, శ్రమలయందు ఆనందించు వాడుగానున్నాడు. సిలువను మోయనిదే జీవ కిరీటము ఎంతమాత్రము దొరకదని ఇతనికి తెలియును. ఇతడు క్రీస్తుతో కూడా లేపబడిన అనుభవముగలవాడై, నూతన జీవితమును కలిగి, పైనున్న వాటినే వెదకువాడుగా ఉన్నాడు. భూసంబంధమైన వాటిమీద ఎంత మాత్రము ఇతడు మనస్సు నిలుపువాడు కాడు. పరసంబంధమైనట్టియు, అక్షయమైనట్టియు, అశాశ్వతమైనట్టి వాటిపైననే గురిని నిలిపి, క్షయమైన లోకమును, దాని ఆశలను విసర్జించినవాడై యుండెను ఇతడు పరిపూర్ణమైన విశ్వాసముతో, అదృశ్యమైన దైవ వాగ్దానములును పరమ భాగ్యములను, రాబోవు మహిమ రాజ్యమును, వెదకుచున్నాడు. నీటికాలువల యోరను నాటబడిన వృక్షము వలె ఇతడు తన క్రైస్తవ జీవితములో ఎదుగుచూ, వాడబారక ఫలించుచూ, త్వరలో దేవుని మహిమగల కౌగిలిలోనికి చేకొనుటకు సంసిద్ధుడగుచున్నాడు తగిన కాలములో ఫలమిచ్చు వృక్షముగాను, నిజమైన ద్రాక్షవల్లియగు క్రీస్తు యొక్క నిజమగు తీగగాను, సమృద్ధియైన ఫలములనిచ్చే తీగగాను. ఇతడు జీవించుచున్నాడు ఇతడు పరిపూర్ణమైన దేవుని ప్రేమతో నింపబడియున్నందున, మరణ భయమనేది తెలియని స్థితిలో ఉండెను. ఒకవేళ అతడు మరణించినను, ఆనందకర



మైన రాజ్యములో యుగయుగములు జీవించి యుండును. ఇట్టి జయకరమగు జీవితము జీవించుటకు, ఇతని హృదయములో నింపబడిన పరిశుద్ధాత్మశక్తియే కారణమైయున్నది. ఈ ఆత్మ నియమముద్వారా ఇతడు తన క్రైస్తవ జీవితమును కొనసాగించుకొనుచుండెను.

---

# పదవ పటము

## THE TENTH PICTURE

యేసు ఈలాగు చెప్పెను. "నేనే పునరుత్థానమును జీవమునై యున్నాను. నాయందు విశ్వాసముంచువాడు చనిపోయినను బ్రతుకును, బ్రతికి నాయందు విశ్వాసముంచు ప్రతివాడు ఎన్నటికిని చనిపోడు" ( యోహాను 11 : 25,26) "నామాట విని నన్ను పంపిన వానియందు విశ్వాసముంచువాడు నిత్యజీవము గలవాడై యున్నాడు. వాడు తీర్పులోకి రాక మరణములోనుండి జీవములోకి దాటి యున్నాడని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను." (యోహాను 5:24) పౌలు భక్తుడీలాగు చెప్పుచున్నాడు. "క్షయమైన ఈ శరీరము అక్షయతను ధరించుకొనవలసి యున్నది. ఈ క్షయమైనది అక్షయతను ధరించుకొనినపుడు, ఈమర్త్యమైనది అమర్త్యతను ధరించుకొనినపుడు—విజయము కలుగునట్లుగా మరణము మ్రింగబడెను. అని వ్రాయబడిన వాక్యము నెరవేరును ఓ మరణమా? నీవిజయ మెక్కడ? ఓమరణమా నీముల్లెక్కడ? మరణపు ముల్లు పాపము. పాపమునకున్న బలము ధర్మశాస్త్రమే అయినను మన ప్రభువైన యేసుక్రీస్తు మూలముగా మనకు జయము అనుగ్రహించుచున్న దేవునికి స్తోత్రము కలుగును గాక! ( 1 కొరింథి 15 : 54-57 )

దేవుని అడుగుజాడలలోనడుచుచూ, ఆయనలోజీవించే వ్యక్తి ఎన్నడును మరణము విషయములో భయపడడు. మరణ భయ మతనికి ఎంత మాత్రమూ ఉండదు. ఎందు



చేరననగా అతడు మరణించవలసిన ఘడియలు వచ్చినపుడు మహానందముతో మహోన్నతుడైన దేవుని సన్నిధానమును చేరుటకు ఆశపడును. పరమ రాజ్యమునందు యుగయుగములు దైవ సాన్నిధ్యన్ని గడిపె తరుణం వచ్చినందున అతిడెంతో ఆనందించును. "నేను వెడలిపోయి క్రీస్తుతో కూడా నుండవలెనని నాకు ఆశ యున్నది" (ఫిలిప్పీ 1 : 23 ) అని పౌలు భక్తునివలె ధైర్యముగా చెప్పెను

సత్క్రైస్తవుడు తన్ను రక్షించి, తన నిమిత్తమై సిలువలో ప్రాణము పెట్టిన యేసుప్రభుని ముఖమును ఎప్పుడు చూతునాయని దిన దినము, క్షణ క్షణము ఎదురు చూచుచుండును. అతనిలోనున్న, పరిశుద్ధాత్మ కూడా యేసు ప్రభువు చెప్పిన ఈ మాటలను గుర్తు చేయును. "మీ హృదయములను కలవర పడ నియ్యకుడి. దేవునియందు విశ్వాసముంచుచున్నారు. నాయందును విశ్వాసముంచుడి. నా తండ్రి యింట అనేక నివాసములు గలవు. లేనియెడల మీతో చెప్పుదును. మీకు స్థలము సిద్ధపరచ వెళ్ళుచున్నాను నేను వెళ్ళి మీకు స్థలము సిద్ధపరచినపుడు, నేనుండు స్థలములో మీరును ఉండులాగున మరల వచ్చి నా యొద్ద నుండుటకు మిమ్మును తీసుకొని పోవుదును." (యోహాను 14 : 1-4 ) "దేవుడు తన్ను ప్రేమించువారి కొరకు ఏవి సిద్ధపరచెనో అవి కంటికి కనబడలేదు, చెవికి వినబడలేదు మనుష్య హృదయమునకు గోచరము కాలేదు" (1 కొరింథి 2 : 9 ) ఇహ లోకములో యేసు ప్రభుని అడుగు జాడలలో జీవించిన వానికొరకు, పరలోకములో సిద్ధపర్చబడిన ఉత్కృ

ష్టమైన స్థలమునుగూర్చివర్ణించుటకు తగుభాష, లేక మాటలు ఈలోకములోనే లభించవు. ప్రభువు తన ప్రియబిడ్డలకొరకు సిద్దపరచిన పరమ భాగ్యములు ఊహించజాలనివి, చెప్పనోల్ల



**10. మహిమ గృహమునకు మరలిపోవుట**

**THE GLORIOUS HOME GOING**



కానివి. ఏ మానవుడూ వాటిని స్పష్టముగా వివవరించి చెప్పలేడు. లోకమందలి సమస్థ భోగ భాగ్యములూ, పరలోక భాగ్యములతో ఎంత మాత్రము పోల్చబడ జాలనివి.

ఈపటములోని దైవజనునికి ఇహలోకయాత్రసమాప్తమైనది. తొమ్మిదవ పటములోని పాపికి మరణ మాసన్నమైనపుడు, ఆ మరణము భయంకరమైన అస్థిపంజరమువలె ఉన్నట్లు చూచితిమి. అయితే ఈ పటములో అస్థిపంజరముగాని, భయంకరత్వముగాని కనిపించుటలేదు. దేవుని దూతి ఇతని ఆత్మను దేవుని సన్నిధికి, మహిమకరమైన రాజ్యమునకు కొనిపోవుటకు సిద్దముగా ఉన్నది. మరణమనేది పాపికి బహు భయంకరముగాను, దేవునియందు జీవించిన వానికి, ఆనందముగాను గోచరించుట గమనించవలసిన విషయమే! క్షయమైన ఇతని శరీరమునుండి ఆత్మయు, ప్రాణమును వేరైపోయెను. అతని అత్మ జీవముగల దేవుని యొద్దకు ఎగసిపోవుచుండెను. ఈ ఆత్మకొరకు పరలోకపు తలుపులు తెరువబడి యుండెను. అతడు పూర్ణ హృదయంతోను, పూర్ణ ఆత్మతోను, పూర్ణశక్తితోను ప్రేమించిన ప్రేమగల ప్రభుని రొమ్మును ఆనుకొనుటకు అతని ఆత్మ పరలోకమునకు వెళ్ళుచుండెను. అతనికి ఆనందకరమైనఆహ్వానము ఆప్రభుని రాజ్యము అనుగ్రహించబడెను. "అతని యజమానుడు—భళా నమ్మకమైన మంచిదాసుడా! నీవు ఈ కొంచెములో నమ్మకముగా ఉంటివి. నిన్ను అనేకమైన వాటిమీాద నియమించెదను. నీ యజమానుని సంతోషములో పాలుపొందు

మని అతనితో చెప్పెను." (మత్తయి 25 : 21) ఇక ఇతనిపై సాతానుకు ఎంతమాత్రము అధికారములేదు. "యెహోవా భక్తులమరణము ఆయన దృష్టికివిలువగలది" (కీర్తన 116: 15) "ఇప్పటినుండి ప్రభువునందు మృతినొందు మృతులు ధన్యులని వ్రాయుమని పరలోకమునుండి యొక స్వరము చెప్పగావింటిని. నిజమే వారు తమప్రయాసములు మాని విశ్రాంతిపొందుదురు" (ప్రకటన 14 : 13)

—:o:—



# చివరి హెచ్చరిక

## LAST ADMONITION

ప్రియ చదువరీ! నీ హృదయమును, నిన్నెంతగానో ప్రేమించి నిత్యజీవము నియ్యదలచిన దేవునికి అంకితము చేయునట్లు, ఆయనే నీకు తగిన సహాయము చేయును గాక! ఆయన నిన్ను ఈలాగు అడుగుచున్నాడు. "నా, కుమారుడా! (నా కుమార్తే!) నీ హృదయము నాకిమ్ము" (సామెతలు 23 : 26) ఈ జాలిగల పిలుపును అంగీకరించి, నీ హృదయమును ఆయనకు సమర్పించిన నీకు మేలుకలుగును. నీ భారముతో కూడిన హృదయమును, దుఃఖముతో కూడిన హృదయము, నిరుత్సాహముతో కూడిన హృదయమును, యేసు ప్రభువుకు సమర్పించుము. ఆయన నీకు నూతన హృదయము, నూతన శక్తి అనుగ్రహించును. నీకోత హృదయమును, బాధలతో నిండిన హృదయమును ఆయన బాగు చేయును. మోసకరమైన నీహృదయమును నీవు నమ్ముకొన వద్దు నీహృదయము నిన్నే మోసము చేయును, నీ హృదయముయొక్క ఇచ్ఛలను నెరవేర్చుకొనుటకు ఆతృత పడవద్దు. అవి నిన్ను నిత్యనరకాగ్నికి నడిపించును. దేవునికి అర్పించబడక పూర్వము, దేవుని ఆత్మచేత నింపబడక పూర్వము హృదయము ఎంతో భయంకరమైనదిగా ఉండును. "తన మనస్సును నమ్ముకొనువాడు బుద్ధిహీనుడు." (సామెతలు 28 : 26) అని భక్తుడు వ్రాయుచున్నాడు. కనుక స్నేహ

తొడా! ఇప్పుడే నీ పాపములను విసర్జించి, నీతి మార్గము లోనికి మళ్ళుము. అందుకు దేవుని సహాయము నీకుఉన్నది. రక్షకుడై యేసుప్రభువు నీ మనస్సునుమార్చి, నీ పాపములు క్షమించి, నీకు నిత్యజీవము నిచ్చుటకు కోరుచున్నాడు. "అయినను ఇప్పుడు పాపమునుండి విమోచింపబడి దేవునికి దాసులైనందున పరిశుద్ధత కలుగుటయే మీకు ఫలము. దాని అంతము నిత్యజీవము ఏలయనగా పాపము వలనవచ్చు జీతము మరణము, అయితే దేవుని కృపావరము మన ప్రభువైన క్రీస్తు యేసునందు నిత్యజీవము" (రోమా 6:23)

నిన్ను నీవు దేవునికి సమర్పించుకొని రక్షకుడైన క్రీస్తు ప్రభుని దివ్యబోధలచేత నిరంతరము హెచ్చరించ బడుచూ, విశ్వాస ప్రేమలను ధరించుకొనుము. యేసుప్రభుని ఆదరణ వచనములే నిన్ను నిరతము ఆదుకొనగలవు. పౌలు భక్తుడిలాగుపలుకుచున్నాడు. "ఆ హేతువుచేత ఈ శ్రమలననుభవించుచున్నాను గాని నేను నమ్మినవానిని ఎరుగుదును. గనుక సిగ్గుపడను; నేను ఆయనకు అప్పగించినదానిని రాబోవుచున్న ఆ దినము వరకు ఆయన కాపాడగలడని రూఢిగా నమ్ముకొనుచున్నాను" (2 తిమొథి 1.12) యేసు ప్రభుని సన్నిధానములో మనము శ్రమలకు నిందలకు భయపడ నక్కరలేదు. అంత్యము వరకు మనము ఆయన సన్నిధిలో నమ్మకముగా ఉండగలిగిన, అంతవరకు ఆయన మనలను కాపాడును, క్రీస్తునందు విశ్వాస ప్రేమలుగలవారమై మనము నడుచుకొందము విశ్వాసములో ఎడతెగక నీవు బలపడుచూ, పరిశుద్ధాత్మని



సాన్నిధ్యములో మెళకువగా ఉండి ప్రార్థించుచూ, దేవుని ప్రేమనుండి ఎంతమాత్రము ఎడబాయక ముందుకు సాగుము. మార్గమును, సత్యమును, జీవమునై యున్న యేసు ప్రభుని వైపు చూచుచూ, ఆయన రమ్యమగు మార్గములలో నడువుము. ఆయన రాజులకు రాజును ప్రభువులకు ప్రభువునై యుండి, తన కొరకు జీవించే, తనవారిని, ఆయన మహిమ రాజ్యమునకు కొనిపోవుటకు త్వరలో రానై యుండెను, ఆయన రాకడ కొరకు నిత్య నిరీక్షణ గలిగి యుండుము. ప్రార్థన యందును, విశ్వాసము నందును, ఆయన దివ్య వచనములను ధ్యానించుట యందును; ఎడతెగక, మెలకువగా ఉండుము. ఆయన నిన్ను నడిపించునట్లు నీపూర్ణ హృదయమాయనకు సమర్పించుము.

"తొట్రిల్లకుండా మిమ్మును కాపాడుటకును, తన మహిమ యెదుట ఆనందముతో మిమ్మును నిర్దోషులుగా నిలువబెట్టుటకును శక్తిగల మన రక్షకుడైన అద్వితీయ దేవునికి మన ప్రభువైన యేసుక్రీస్తు ద్వారా, మహిమయు, మహాత్మ్యమును, ఆధిపత్యమును, అధికారమును యుగములకు పూర్వమును, ఇప్పుడును సర్వయుగములును కలుగును గాక!

(యూదా 24;25) ఆమెన్.

—:o:—

## THERE'S A LAND THAT IS FAIRER THAN DAY.

రవికాంతిని మించినదౌ
ఒకదేశము దూరమున
వరభక్తులు చూచెదరు
తండ్రి యాశ్రయ మిచ్చుటన్
"అహహా త్వరలో
మేముచేరుదు మాస్థలమున్

దుఃఖ బాధలు లేక సదా
పూర్ణశాంతిని బొందుచును
పరిశుద్ధుల కీర్తనలు
అందు నెప్పుడు బాడుదుము
"అహహా త్వరలో
మేముచేరుదు మాస్థలమున్

ప్రేమ సాగరుడౌ జనకున్
మాకువిచ్చిన మేలులకై
మాకృతజ్ఞత జూపుచును
నిత్యమున్ స్తుతియించెదము
"అహహా త్వరలో
మేముచేరుదు మాస్థలమున్



## విజ్ఞప్తి

మానవ హృదయము అను ఈ పుస్తకము అన్ని తరగతుల వారికి అందుబాటులో నుండునట్లు చక్కని పటముల సహాయమున పొందుపరచబడినది "హృదయము అన్నిటికంటె మోసకరమైనది. అది ఘోరమైన వ్యాధి గలది. దానిని గ్రహింపగలవాడెవడు?" అని దేవుడు తన ప్రవక్తయగు ఇర్మియాద్వారా పలికియుండెను. అయితే ఇట్టి మానవ హృదయాన్ని దేవుడెంతగానో ప్రేమించి యుండుటచేతే "నూతన హృదయము మీకిచ్చెదను. నూతన స్వభావమును మీకు కలుగజేసెదను" అని వాగ్దానము చేసియుండెను. ఈ వాగ్దానఫలము మనము రక్షకుడైన యేసుక్రీస్తు ప్రభువు ద్వారా పొందగలుగుచున్నాము. వెలుగై యుండిన ప్రభువు మన హృదయములోనికి వచ్చునపుడు ఇందలి అంధకారము తొలగిపోవుచున్నది. పరిశుద్ధుడైన ప్రభువును మన స్వకీయ రక్షకునిగా అంగీకరించుటద్వారా మనమునూ ఆయన పరిశుద్ధత లోపాలు పొందగలుగుచున్నాము. ఆయన కార్చిన పవిత్ర రక్తముద్వారానే మానవకోటి హృదయాలు శుద్ధీకరించబడుచున్నవి

ఈ పుస్తకమునందు గల పటములలో ఉపయోగించిన జంతువులు ఆయా పాపములను సూచించే ఊహాచిత్రములు. సాతానుకు నిలయమైన హృదయం నిజంగా మోసకరమైనదే.

అది సమస్త దుర్నీతికి నిలయమై యుంటుంది పాపము అనేది ఏదో ఒకే ఒక పనిని చేయించదు. పాపము అనే శక్తి నుండి అనేక పాపములు ఉత్పన్నమౌతాయి. ఈ పాపపుశక్తి నిలయం మానవ హృదయమే! ఈశక్తి హృదయంలో పని చేయుచూ అనేక పాపములు చేయించును. ఈ పాపపుశక్తిని రూపుమాపే శక్తి పరిశుద్ధుడైన ప్రభువుకు మాత్రమే ఉన్నది. ప్రభువు మార్గపథమే మనలను పరిశుద్ధ జీవితమునకు మళ్ళించగలదు

చదువరులీ పుస్తకమును ఎవరి హృదయస్థితిని వారు జాగ్రత్తగా పరిశీలించుకొనుచూ, ప్రార్థన పూర్వకముగా చదివినపుడు మాత్రమే ప్రయోజనము పొందగలరు. ఈపుస్తకము మీ హృదయమున కొక అద్దమువలె ఉపకరించును. ఇందలి తొమ్మిదవ పటమునందు, తన పాపముల విషయమై పశ్చాత్తాపము నొందని పాపియొక్క అంతిమస్థితియు, పదియవ పటములో, యేసుక్రీస్తు ప్రభువుద్వారా రక్షించబడిన వ్యక్తి యొక్క స్థితియు మనము చూచుచున్నాము. మనము మన హృదయముద్వారా ఎంతమాత్రము మోసపర్చబడక, సాతానుయొక్క శక్తియుక్తులనుండి విడుదల నొందుటకును ఆనందకరమైన పరమరాజ్యమునకు వారసుల మగుటకును మన రక్షకుని అడుగుజాడలలో ముందుకు సాగుదము. ప్రభువు ఇట్టి ధన్యకరమైన జీవితము మా చదువరులెల్లరకు అనుగ్రహించునట్లు ప్రార్థించుచున్నాము.



ఈ పుస్తక పఠనముద్వారా మీరు పొందిన ఆత్మీయ మేలును గూర్చి మాకు తెలియపరచిన, మీకు ఇంకనూ ఉపయోగకరమగు, ఆత్మీయ సాహిత్యాన్ని ఉచితంగా అందచేయగలము నేడే యిందలి తీర్మాన పత్రమును పూరించి మాకు పంపండి. ఈ పుస్తకాన్ని మీరు చదివిన తర్వాత మరో స్నేహితునికివ్వండి

ఇట్లు,
మేనేజరు.
ఫ్రీ ట్రాక్టు సెంటరు
గంటి పోస్టు.
కొత్తపేట తాలూకా
తూ॥ గో॥ జిల్లా (ఆంధ్ర ప్రదేశ్).

## THERE'S A LAND THAT IS FAIRER THAN DAY.

"There's a land that is fairer than day,
And by faith we can see it afar,
For the Father waits over the way,
To prepare us a dwelling-place there.
We shall sing on that beautiful shore
The melodious song of the blest,
And our spirits shall sorrow no more,
Not a sigh for the blessing of rest.

CHORUS:

In the sweet by and by
We shall meet on that beautiful shore".

THE END.

This booklet "The Heart of Man" is available in over 200 languages and dialects spoken throughout the world (Africa, Asia, The Far East, South America, Europe, etc.)

The 10 heart pictures contained in this booklet are also available in the form of large coloured picture charts (86 x 61 cm) bound together in a set of 10 pictures. These "Heart Charts" can be obtained with European or African features and are particularly suitable to be used in conjunction with the Heart Book for class-teaching, open air evangelization etc. Kindly contact us to ascertain the latest subsidized price of this chart.

*****

Kindly write to us if you are able to assist us with further translations of our free Gospel literature, informing us of the language into which you could translate this Gospel literature. Your assistance would be appreciated.

If you have found salvation in Christ, or have been otherwise blessed through our Gospel literature, please let us know. We would like to thank God with you, and remember you further in our prayers.

*****

For Gospel literature, books and free Gospel tracts in over 260 languages, write to:

**ALL NATIONS GOSPEL PUBLISHERS**
**P.O. BOX 2191, PRETORIA, 0001, R.S.A.**
(A Gospel Literature Mission financed by donations)
(Reg. No. 61/01798/08)